# ఊహల ఊయల

(కథా సంకలనం)

## ఐతా చంద్రయ్య




జాతీయ సాహిత్య పరిషత్తు

సిద్ధిపేట - 502 103.

జాతీయ సాహిత్య పరిషత్తు - సిద్దిపేటశాఖ
ఇరవై రెండవ ప్రకాశనము.

# ఊహల ఊయల
(కథా సంకలనం)

ప్రథమ ముద్రణ
ఫిబ్రవరి 1992.
ప్రతులు 1000.

వెల { సాధారణ ప్రతి రూ|| 20/-
గ్రంధాలయ ప్రతి రూ|| 25/-

హక్కులు :- రచయితవి

ముఖచిత్రము ; శ్రీ కె. రాజయ్య

ప్రతులకు ; 1. ఐతా లింగామూర్తి
ఇం.నం. 4-4-11, పేర్ పురా,
సిద్దిపేట-502 103. (మెదక్ జిల్లా.)

2. సాహిత్య నికేతన్
బర్కాత్ పురా. హైదరాబాదు.

ముద్రణ ; తిరుమల ప్రింటర్స్ సుభాష్‌రోడ్, సిద్దిపేట. ఫోన్ ;-
ముఖపత్ర ముద్రణ ; సరస్వతి ప్రింటర్స్ సుభాష్‌రోడ్, సిద్ది

# కథా ప్రియులకు ......



తెలుగు సాహిత్యంలో కథా ప్రక్రియకు క్షీణదశ వచ్చేసిందని భావిస్తున్న రోజులివి, తెలుగులో మంచి కథలు రావడంలేదని కథాప్రియులు, విమర్శకులు ఆవేదన చెందుతున్న తరుణములో నవలా సాహిత్యం పత్రికల పుటలనాక్రమించి, కథల్ని కప్పేస్తున్నాయి. ఉత్తమ కథల కోసం ఎదిరిచూస్తున్న పాఠకుల నలరించాలన్న ఆశయానికి రూపకల్పనే ఈ "ఊహల ఊయల".

ఆధునిక కథారచయితల్లో తమకంటూ ఒక స్థానాన్ని సంపాదించుకుని, జాతీయాభ్యుదయ పథంలో పురోగమిస్తున్న రచయిత శ్రీ ఐతా చంద్రయ్య. మా సంస్థ ధ్యేయానికి అనుగుణంగా కథా రచన గావించిన శ్రీ చంద్రయ్యగారి కథలు దాదాపు నేటి ప్రామాణిక పత్రిక లన్నింటిలో ప్రచురితమయ్యాయి. సంకలనంలో కథలన్నీ ఆణిముత్యాల్లాంటివే. తెలుగు సాహితీలోకానికి జాతీయ సాహిత్య పరిషత్తు అందిస్తున్న 22వ కుసుమాన్ని ప్రచురించే అవకాశాన్ని కలిగించిన శ్రీ చంద్రయ్యగారికి కృతజ్ఞతలందజేస్తూ ఆంధ్ర పాఠకలోకం సమాదరించి మా కృషిని ప్రోత్సహిస్తుందని ఆశిస్తున్నాము.

చెప్పెల హరినాథశర్మ
సహ కార్యదర్శి
జాతీయ సాహిత్య పరిషత్తు
సిద్ధిపేట-502 103.

ప్రతి
ష్ఠ సప్తమి

# కృతజ్ఞతలు

కథా సరిత్సాగరములో తేలియాడిన నా ఊహలకు రూపకల్పనే ఈ "ఊహాల ఊయ్యాల" కథా సంకలనం. ఇందులోని మొదటి కథ "ఊహాల ఊయ్యాల" 6-8-89 ఆంధ్రప్రభ వార పత్రికలో అచ్చైంది. మిగితా కథలన్నీ వివిధ పత్రికల్లో అచ్చైనవే.

అచ్చైన కథల్ని పుస్తకరూపములో తెచ్చేందుకు ఆర్థికముగా, హార్థికముగా ప్రోత్సహించిన వదాన్యులు శ్రీ తడ్కమడ్ల లింగయ్యగార్కి కృతజ్ఞతాభి వందనములు. తమ వంతు ఆర్థిక సహాయమందించిన దాతలు సర్వశ్రీ రేకా అంబయ్య, కోమురవెల్లి శివప్రసాద్, కొమురవెల్లి చంద్రశేఖర్, తడ్కమడ్ల లింగయ్య గారలకు శతాధిక వందనాలు.

నా ప్రయత్నాన్ని ప్రోత్సహించిన మిత్రులు శ్రీ కనపర్తి రామచంద్రాచార్యులు, శ్రీ చెప్పెల హరినాథశర్మ, పుస్తకాన్ని అచ్చువేసిచ్చిన శ్రీ కె. సత్యనారాయణ, శ్రీ బి. భాస్కర్ గారలకు ధన్యవాదములు.

— రచయిత

# కథల క్రమం

# ఊహల ఉయ్యాల

రిక్షా దిగి ఇంట్లో కెళ్ళబోయిన బ్రహ్మనాయుణ్ణి చూచి కిసుక్కున నవ్వింది తాళం కప్ప, గిజగిజ లాడింది మనసు.

సబ్ రిజిస్ట్రార్ ఆఫీసర్‌గా రిటైరై ఈ వయసులో ఆర్టీసీ బస్సులో రెండొందల కిలోమీటర్లు నిరాఘాటంగా ప్రయాణంచేసి, పద్మవ్యూహం ఛేదించినవాడిలా తనను తానభినందించుకున్నాడు కాని తాళం కప్ప కనపడగానే ఉసూరుమంది ప్రాణం. తన గుండెకు వేలాడదీసిన గుదిబండలా కనిపించింది.

రిటైరైన తర్వాత పెన్షన్, గ్రాట్యుటీ, కమ్యుటేషన్ బాపతు సొమ్ము వచ్చిం తర్వాత ఓ సారి ఏడుకొండల వాడిని చూసి రావాలన్న కోర్కె కలిగింది. ఎందుకంటే రిటైర్ కాకముందు తన దగ్గరి కెందరో వచ్చేవారు, బెల్లం చుట్టూ మూగే ఈగల్లా జీతాలు, పెన్షన్, బకాయిలు, రకరకాల బిల్లులు ఎన్‌క్యాష్ కావాలంటే తన సంతకం తప్పనిసరాయె మరి! బల్లకింద నుంచి తైలమందించనంత వరకు తానే బిల్లు మీదా సంతకం చేయడని వారందరికీ తెలుసు.

అప్పుడు మరుగైన పాపభీతి రిటైర్ట్ కాగానే కాళ్ళను చుట్టే

సి కలవరపెట్టాయి. మరునాటి నుంచే తనను చూడగానే వంగి వంగి నమస్కారాలు చేసిన దఫేదారే మూతి తిప్పడం చూసి నగం చచ్చిపోయాడు.

పెన్షన్, గ్రాట్యుటీ, కమ్యుటేషన్ వాల్యూ కొరకు కొన్ని జతల చెప్పులు అరిగేదాకా తిరగాల్సొచ్చింది.

ఎక్కడికి కెళ్ళినా "తమకు తెలిందేముంది సార్!" అంటూ సకిలించేవాళ్ళే తాను సంపాదించిన దాంట్లో చాలా వరకు తైలం కింద ఖర్చు పెట్టేప్పుడుగాని తెలిసిరాలేదు. అవినీతి ఎంత భయంకర రూపం దాల్చిందో, సామాన్యుల నెలా పీడిస్తోందో!

అలా డబ్బు రావడమాలస్యం, ఇలా బండెక్కేశాడు-ఓ పది రోజుల్లో తిరుపతి, శ్రీశైలం, మహానందిలాంటి పుణ్యక్షేత్రాలు దర్శించి వద్దామని వచ్చేప్పుడు అత్తవారిల్లయిన సూర్యాపేటలో ఓ రోజు ఉండి మరీ బయలుదేరాడు.

ఏడుకొండలవాడి మూడు నామాలు ఎదలో చెరగని ముద్ర వేశాయి. మనసు అప్పుడెంత ప్రశాంతంగా ఉందో ఇప్పుడంత గాభరా చెందింది.

"బావున్నారా బాబాయ్?"

మెట్లమీద లగేజీతో కూచున్న బ్రహ్మానాయుణ్ణి పలకరించింది పక్కింటి పార్వతి. కూతురితో తాళం చెవి పంపించింది.

"బావున్నానమ్మా" అంటూ తాళం తీశాడు కోడలెక్కడికెళ్ళుంటుందబ్బా? అన్న మనసుకు మనసే సమాధానం చెప్పింది-ఏ పేరంటానికో వెళ్ళుంటుందని.

తలుపులు తెరుచుకున్నాయి. ఇల్లంతా చిందరవందరగా ఉంది. లూటీకి గురైన మక్కచేనులా చూడ్డాని కసహ్యమేసింది ఉండబట్టలేక తాను సర్దగలిగినంత సర్దాడు. ఇంకా కోడలు రాలేదు. కొడుకు కేశవరాం ఆఫీసు నుంచి వచ్చేందు కింకా చాలా టైముంది. ఇల్లు చిమ్మటం ప్రారంభించాడు! రుక్మిణమ్మ నక్కడుంచి రావడం పొరపాటైంది కదూ? కవ్వించింది లోగుట్టు.

అలసట వచ్చేసింది. కాళ్ళూ, చేతులూ కడుక్కొని కాఫీ కాచాడు. తానోకప్పులోకి వంచుకుని మిగతాది ఫ్లాస్కులో పోశాడు.

కాఫీ కప్పు ఖాళీ కాగానే ఆత్మారాముడు శాంతించాడు. కుర్చీలో కూచుని పేపరందుకున్నాడు.

"పోస్ట్!" అన్న కేక వినిపించింది.

గుమ్మంలో కెళ్ళి ఉత్తరా లందుకున్నాడు. అందులో ఒక ఉత్తరం తన పేరున ఉంది. "నాకెవరబ్బా ఇప్పుడు ఉత్తరాలు రాసేది" అనుకుంటూ విప్పాడు.

"పూజనీయులైన మామగారి పాద పద్మములకు నమస్కరించి వ్రాయునది."

"అరె!" ఈఉత్తరం కోడలు రాసింది. తాము వెళ్ళేప్పుడిక్కడే ఉన్న కోడలు ఎప్పుడెళ్ళిందో అంతుపట్టలేదు. కంటిజోడు సవరించగానే కళ్ళు అక్షరాల వెంట పరుగులు తీశాయి – కళ్ళెం లేని గుర్రాల్లా.

మొహం నిండా నీల్లినీడలు చోటు చేసుకున్నాయి. భ్రుకుటి ముడిపడింది. మెదడు కాసేపు పని చెయ్యడం మానేసింది.

ఆతర్వాత కోపం, దిగులు ఆక్రమించుకున్నాయి శూన్య ప్రదేశాన్ని గాలి ఆక్రమించుకున్నట్టు.

కాసేపు పచార్లు చేశాడు. కాసేపు కూచున్నాడు.

భాగవతంలో కృష్ణ లీలలు చదువుకుంటూంటే "తాతయ్యా!", అంటూ చుట్టేశాడు వెనక నుంచి. గునగున వచ్చిన మనవడు ధ్రువుడు."

ఎత్తుకుని ముద్దాడి ఒళ్ళో కూచోబెట్టుకున్నాడు. ధ్రువుడు కేరింతలు కొడుతూ తన మీసాలు పీకే ప్రయత్నం చేస్తున్నాడు "ఒరేయ్ భడవా" అంటూ వారించబోయాడు.

వాడు ఏడుపు బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. నివారణోపాయం ఫెయిలైంది. మీసాలు లాగి దిగి, చప్పట్లు కొడుతూ తుర్రుమన్నాడు. అందుకోవాలని వెంబడించాడు బ్రహ్మనాయుడు. మనవడు వేగంగా పరుగెత్తబోయి పడిపోయాడు. 'తాతయ్యా!' అంటూ చేతులందించాడు "నీవే తప్ప ఇహ పరంబెరుగ" అన్నట్టుగా "ధ్రువా!" అంటూ లేవనెత్తబోయాడు.

"ఎప్పుడొచ్చావ్ నాన్నా?"

కొడుకు కేశవరాం పలుకరించగానే అనుభూతి కరిగింది.

"అప్పుడే వచ్చానారా" మాట నూతిలోంచి వచ్చింది.

ఏంటి నాన్నా అలాగున్నావప్పుడే? అంటూ జాత్రాంలో చొరబడ్డాడు జవాబు కోసం చూడకుండా.

అరికాలి మంట నెత్తికెక్కింది, శివతాండవం చెయ్యాలనిపించింది వెంటనే శాంతమే పరమభూషణమన్న మాట గుర్తు

కొచ్చింది.

'ఏంటి మావయ్యా! అలాగున్నారు? బాగా అలిసిపోయుంటారు. మీ కొడుకు ఉద్యోగం చేస్తున్నాడు కదా! మీరిక వాలెంటరీ రిటైర్మెంటు పుచ్చుకోరాదూ?' ఆఫీసు నుంచి రాగానే ఆప్యాయంగా పలుకరించింది శిల్ప. ఆ పలకరింపుతోనే వెయ్యి ఏనుగుల బలం వచ్చింది.

'ఎందుకమ్మా! ఇంకొక్క సంవత్సరం వరకే గదా! ఎలాగోలా లాగించేస్తారు కదండీ!' అంది రుక్మిణమ్మ కాఫీ అందిస్తూ.

'మీ అత్తగారి అభిప్రాయమే నా అభిప్రాయం. పైగా-మరో మూడు నెలల్లోగా నాకో మనవణ్ణం దివ్వబోతున్నావు గదా! వాడు కాస్త పెరగ్గానే మామూలుగా రిటైరవుతాను. వెంటనే వాడితో 'ఆడుకునే ఉద్యోగంలో జాయినవుతాను' అన్నాడు కాఫీ కప్పు ఖాళీ చేస్తూ.

'పోండి మావయ్యా!' సిగ్గుల మొగ్గలు రాల్చి ఖాళీ కప్పు తీసు కెళ్ళింది కోడలు.

మనసారా నవ్వుకోవడం వృద్ధ దంపతుల వంతైంది.

'ఏంటి నాన్నా? ఏదో పోగొట్టుకున్న వాడిలా అలా కూచున్నావ్?' మొహం కడుక్కొచ్చిన కేశవరాం మొహం చిట్లించాడు, తువ్వాలుతో తుడుచుకుంటూ.

కొత్తగా దుఃఖపడుతున్న కొడుకు మొహం చూద్దామనుకుంటే కుదరలేదు.

'అమ్మా కాఫీ ఇవ్వవే!' వంటిట్లో చొరబడ్డాడు కేశవరాం. అమ్మ లేదు. పక్కింటి కెళ్ళుండొచ్చనుకున్నాడు. ప్చ్!

పిచ్చి అమ్మ. ఏదన్నా ఊరెళ్ళి వచ్చినా, సినిమా కెళ్ళి వచ్చినా వీధిలోని ఆడవాళ్ళందరికీ విశేషాలు చెబుతుంది పూసగుచ్చినట్టు. అందాకా ఆమెకు నిద్రపట్టదు. అనుకుంటూ కాఫీ కప్పులోకి వంచుకున్నాడు.

'చూశావా! నీ కోసం కాఫీ కాచి ఉంచింది, అలిసిపోయి వస్తావని. అమ్మ మనసు వెన్నపూస, అందుకే అంటారు కాబోలు 'అమ్మ ఆకలెరుగుతుంది. అర్ధాంగి అర్థమెరుగుతుం'దని అంది మనసు.

కాఫీ కప్పు ఖాళీ చేస్తూ, పెళ్ళాం బెల్లం- అమ్మ అల్లం అనే ఆలోచననే తనకు రానందుకు కనుబొమ లెగరేసి ఛాతీ విరుచుకున్నాడు. ఈల వేయబోయి నాలిక్కరుచుకున్నాడు.

'అమ్మ ఎవరింటి కెళ్ళింది నాన్నా?' అడిగాడు

పది రోజులు దాటింది అమ్మను చూసి, త్వరగా చూడాలనే ఉబలాటం గరిష్ఠస్థాయికి చేరుకుంది.

'అబ్బా! మాట్లాడవేం నాన్నా?' ఎదురుగా కుర్చీలో కూలబడ్డాడు చెట్టుమీంచి పండురాలినట్టు.

మొహం పక్కకు తిప్పుకున్న బ్రిహ్మనాయుడి మౌనవ్రితం చిరాకెత్తించింది కేశవర్మాను.

'అబ్బబ్బా! చెప్పవేం నాన్నా?' అసహనం.

మొహం తిప్పి కేశవరాం కళ్ళలోకి సూటిగా చూశాడు తండ్రి.

'అప్పట్నుంచి గమనిస్తున్నాను, మీ అమ్మ ఏదనే అడుగుతున్నావ్ గాని, నా కోడలేదో చెప్పవేం? నా మనవడి నెక్కడికి పంపించావో చెప్పి ఏడవ్వేం?' అనేసాడు రుసరుసలాడుతూ.

పులిలా లేద్దామనుకున్న కేశవరాం పిల్లైపోయాడు.

'ఓహ్! అదా మీ కోపం? శిల్ప పుట్టింటి కెళ్ళింది. బాబు వాళ్ళమ్మమ్మ ఇంటి కెళ్ళాడు. నేనూ మాఅత్తవారింటి కెళ్ళొచ్చాను' కాసింతైనా తండ్రిని రంజింప జేయాలనుకున్నాడు.

'అందరూ కలిసే వెళ్ళారా?' జోకు పేలలేదు.

'ఔనా న్నా!' వినయం.

'ఐతే వాళ్ళనక్కడే వదిలేసి నువ్వెందుకొచ్చావిక్కడికి? మొహమ్మీద గుద్దినట్టడిగాడు.

'అదేంటి నాన్నా? అక్కడికెళ్ళగానే శిల్పకు నాలుగురోజులుండాలనిపించిందక్కడ, సరేనని ఉండి రమ్మన్నాను' నీళ్ళు నమిలాడు.

'ఉండి వస్తానందా! ఉండిపొమ్మన్నావా?'
ముసలాయన తిరకాసుకు తట్టుకోలేకపోయాడు.

'ఇంతకీ అమ్మ!' ప్లేటు ఫిరాయించబోయాడు.

'మీ అమ్మను వాళ్ళ పుట్టింట్లో వదిలేసి వచ్చాను. వస్తూ నేను మీ అమ్మమ్మ ఇంటికీ, మాఅత్తవారింటికీ వెళ్ళి మరీ వచ్చాను' తడుముకోకుండా చెప్పేశాడు.

'ఐతే వచ్చేప్పుడు సూర్యాపేట కెళ్ళారా?' విస్మయం.

'ఔను. అందుకే పది రోజులనుకుంటే ప్రయాణం పన్నెండు రోజులు దాటింది.'

నాన్న మీద కోపమొచ్చింది కేశవరాంకు.

'ఫ్లాస్కులో కాఫీ నేను పోసిందే' తిరిగి తానే అంటూ కోడుకు వదనారవిందం మీద దోబూచులాడుతున్న రంగుల్ని పరిశీ

లించసాగాడు.

'అలాగా? కానీ.... అమ్మ నెందుకు ...'

'పుట్టింట్లో ఉంచి వచ్చానంటావు?'

ఔనని తలూపాడు కేశవరాం.

'కొన్ని నెలలక్కడే ఉంటానని సరదాపడింది. ఇక మళ్ళీ రానక్కరలేదని చెప్పి వచ్చేశాను.' మొహం మళ్ళీ పక్కకు తిరిగింది.

'ఏం? ఎందుకు?' చిర్రుమంది కోపం.

'ఔను. మా పెళ్ళిలో మీ అమ్మమ్మ మా మామగారలు నాకో సైకిల్ మోటారు కొనిస్తామన్నారు. ఇంకా కొనిపెట్ట లేదింతవరకు. కొనిచ్చేదాకా మీ అమ్మ అక్కడే ఉంటుందని మీ అమ్మమ్మతో చెప్పి ఎంచక్కా వచ్చేశాను' చెప్పుకుపోయాడు.

అయోమయంలో కొట్టుకుపోతున్నాడు కేశవరాం.

'ఒకవేళ, కొనివ్వకపోతే?'

"అమ్మ అటు, నే నిటూ" ముసలాయన తీర్పుకు గుండె గుభేలుమంది.

కోపం. ఏడుపు కలగలిసిపోయాయి. ఏమీ చేయలేనితనం వెక్కిరించింది.

'ఛీ,ఛీ! ఇదేమిటి నాన్నా? ఇంత వయసులో.... మీరు....' అసహ్యమేసినా ధైర్యం చాల్లేదు.

'మరి ఈ వయసులో నువ్వేమిట్రా?' కోడలి ఉత్తరం కొడుకు చేతిలో రాలింది.

కేశవరాం చేతులు తమ పని తాము కానిచ్చాయి.

'పూజనీయులైన మామగారి పాద పద్మములకు నమస్కరించి వ్రాయునది.

'మీరీ పాటికి తిరుపతి నుంచి తిరిగి వచ్చారనే, సాహసించి ఉత్తరం రాస్తున్నాను. మీరు తిరుపతి వెళ్ళిన మర్నాడే మీ కొడుక్కు మా పెళ్ళిలో మా నాన్నగారిస్తానన్న స్కూటర్, టీవీల మీదికి మనసు మళ్ళింది. సరదాగా మా పుట్టింటికెళ్ళి వద్దామని నన్నిక్కడికి తీసుకువచ్చారు.

'స్కూటర్, టీవీలు తీసుకుని మాత్రమే తిరిగి రా! లేక పోతే లేదని నన్నూ బాబునూ బలవంతంగా ఇక్కడుంచి వెళ్ళారు'

'మా పెళ్ళైన నెల రోజుల్లోనే మా నాన్న చనిపోయిన సంగతి కూడా తెలుసు! మా తమ్ముడికింకా ఉద్యోగం దొరకలేదు' అమ్మకు వచ్చే పెన్షన్‌కు తోడు అప్పులు చేస్తేనే ఇల్లు గడుస్తుంది' మా అమ్మకు ఫామిలీ పెన్షన్ శాంక్షనయ్యే వరకు చాలా ఖర్చైంది. వచ్చిన గ్రాట్యుటీ అప్పుల తిప్పలకు చెల్లింది.

'అంతకు ముందు కూడా అప్పుడప్పుడడిగేవారు మా వాళ్ళనుక్కు పిండి వసూలు చేసుకురమ్మని. వాళ్ళ పరిస్థితి వివరిస్తూ ఈ విషయం మీ దృష్టికి తెస్తానని చెబుతూ వారించగలిగాను.

'మా తమ్ముడికుద్యోగం దొరికిన తర్వాత ఇస్తామంది మా అమ్మ. కాని మీ అబ్బాయి అనరాని మాటలని వెళ్ళిపోయాడు.

'మమ్మల్ని విడిచి కాలగర్భంలో కలిసిపోయిన మా నాన్నను మీలో చూచుకుంటున్నాను. అత్తగారి ఆదరాభిమానాలకు నా మీద నాకే ఈర్ష్య కలిగింది. కాని ఇలా జరిగిపోయింది.

తాతయ్య కావాలంటున్నాడు మీ మనవడు.

మీ నిర్ణయానికెదురు చూస్తూ....

మీ కోడలు

'శిల్ప'

ఉత్తరం కంపరమెత్తించింది తేలుకుట్టిన దొంగలా అయిపోయాడు కేశవరాం.

మర్నాడు ఆఫీసుకు తయారవుతూ 'అమ్మను చూడకుండా ఇన్ని రోజులెప్పుడూ ఉండలేదు నాన్నా!' అన్నాడు.

శిల్పను, బాబును అక్కడ ఉంచేసినందుకు బాధగానే ఉన్నా, టీవీ, స్కూటర్ కళ్ళలో మెదిలేసరికి మనసు రాయైపోతూంది. వాటిని సాధించి తీరాలనిపిస్తుంది. అమ్మను చూడాలనే తహతహ హద్దులు దాటింది.

'నేను కూడా నా మనవణ్ణి చూడకుండా ఇన్ని రోజు లెప్పుడూ లేన్రా!' తండ్రి ఎదురు బాధ బాగనిపించలేదు.

'కాని నాన్నా మనం కాస్త ఓపిక పడితే, బెట్టుగా ఉంటే ఎలాగోలా శిల్ప వాళ్ళమ్మను సాధించి టీవీ, స్కూటర్ కొనిపిస్తుంది. ఆ తర్వాత ఎంత బావుంటుందో! ఊహాలోకం లోకి లాక్కెళ్ళాననుకున్నాడు తండ్రిని.

'ఔన్రా! మనం ఓపిక పడితే లాభాలే లాభాలు. మీ అమ్మ కూడా మీ అమ్మమ్మ ముక్కు పచ్చడి చేసి సైకిల్ మోటారు కొనిపిస్తుంది. నువ్వు స్కూటర్ మీద, నేను సైకిల్ మోటారు మీద ఝుామ్మని తిరగొచ్చు' ఊహల ఉయ్యాల నెక్కించేశాడు నేనేం తక్కువ తిన్నానా? అన్నట్టు.

'అమ్మ చేతి వంట తినాలనుంది నాన్నా!'

'మనవడి చేత మీసాలు పీకించు కోవాలమందిరా!'

మొండి ఘటం, ముసలాయన్ని గెలవడం కష్టమైపో యింది.

నాల్రోజులైంది.

వంట పని ఇద్దరం కలిసి చేసుకుంటా మనుకున్నా కేశవ రాం ఆలోచన తలకిందులైంది. ప్రతి చిన్న పనికీ ఆయాసం వస్తోంది బ్రహ్మనాయుడికి, పూర్తి రెస్టు తీసుకుంటున్నాడు.

ఆరోజు శుభోదయ సమయంలో అనుమానం వచ్చింది కేశవరాంకు "నాన్న నన్నేదో బోల్తా కొట్టిస్తున్నాడని.

'కావాలనే దొంగాటక మాడుతున్నాడేమో? మొదట తానె న్నిసార్లు స్కూటర్, టీవీల ఊసెత్తినా ఇస్తే తీసుకో, లేక పోతే మానుకో అనేవాడు. ఆ తర్వాత ప్లేటు మార్చి వాళ్ళు ఇబ్బందుల్లో ఉన్నారు. వాళ్ళేమీ మన కివ్వక్కర్లా, శిల్పని కూడా అడగొద్దని చెప్పు అనేశాడు. ఈయన వ్యవహారం చూస్తుంటే అవి వసూల య్యేట్టు లేవనుకుని సమయం, సందర్భం రాగానే ఒక నిర్ణయం తీసుకుంటే ఇలాగైంది. ఇప్పుడేం చెయ్యడం?_అంతర్మథనం.

మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఎత్తుకు పై ఎత్తు తోచింది.

'నాన్నా! నే నీ రోజు కేంపు కెళ్తున్నా, రేపు వస్తా' అని సూటుకేసు సర్దుకుని సాయంత్రానికల్లా సూర్యాపేట కెళ్ళాలని, సంగతేమిటో అక్కడే కనుక్కోవచ్చు- నాన్న చెప్పే దాంట్లో నిజమెంతో అమ్మ నుంచి లాగొచ్చు. ఇక్కడ నాన్న బెదిరింపులు అమ్మకు తెలీవు కాబట్టి ప్రాబ్లం లేదు. ఎంచక్కా అమ్మను తీసుకు రావచ్చు, తన ఐడియాకు తనే మురిసిపోతూ చకచకా పని చేసు

కుపోతున్నాడు ఎక్స్‌ప్రెస్ ట్రైన్‌లా.

'మీకు ఉత్తరం సార్!' ఉత్తర మందించాడు అటెండర్. విప్పాడు.

'చిరంజీవి కేశరాంను, మీ అమ్మ దీవించి వ్రాయునది.

మీ నాన్న, నేనూ తిరుపతి నుంచి రాగానే అప్పుడెపుడో మా పెళ్ళిలో మానాన్న మీనాన్న కిస్తానన్న సైకిల్ మోటారింకా ఇవ్వలేదని గుర్తుకొచ్చింది. కాసేపు ఇద్దరం దెబ్బలాడుకున్నాం రైల్లోనే! రిటైరైన తర్వాత ఇహ కాలి నడకన తిరగాలంటే ఓపిక లేదు. ఇప్పుడది తప్పకుండా కావాలన్నాడు. ఆ సంగతి మరిచి పోమన్నా వినకుండా నన్ను బలవంతంగా అమ్మమ్మ వాళ్ళ ఇంట్లో వదిలేశాడు. సైకిల్ మోటారు తీసుకొనే తిరిగి రమ్మన్నాడు.

మీపెళ్ళై పట్టుమని నాలుగు సంవత్సరాలైనా, కొకున్నా మీ మామ గారిస్తానని ఒప్పుకున్న టీవీ, స్కూటర్ సంగతి నువ్వు గుర్తు చేస్తున్నావా? మీ మామగారు పోయారని గమ్మున ఉం తున్నావు, వాటి మీద ఆశ వదులుకుని, నిన్ను చూసైనా మీనా బుద్ధి తెచ్చుకోవాల్సిన అవసరముంది కదూ?

నా మనసంతా మనవడి మీదే ఉంది. కోడల్ని వంటసే చూడాలని, నా చేతుల మీదుగా నీకు వంట చేసిపెట్టానని ఆశగా ఎదురు చుస్తున్నారా! ఎలాగైనా మీ నాన్నగారి నొప్పించి పం పించు, నువ్వు వస్తే మాత్రం నేను రాను. మీ నాన్న కోస మెదురు చూస్తూ....

మీ అమ్మ

రుక్మిణమ్మ

రెండు చేతులతో తల పట్టుకొన్నాడు, కాసేపు జుట్టు పీక్కున్నాడు. ఫైళ్ళు చించేద్దామన్నంత తిక్కరేగింది కాని, అలా చేస్తే ఉన్నది పోతుంది, ఉంచుకున్నది మూతిపళ్ళూడగొట్టి పోతుందనే సామెత గుర్తుకొచ్చింది. మొహం కందగడ్డయిపోయింది.

అమ్మను నిజంగానే సాధిస్తున్న, నాన్న, మీద నిర్దాక్షిణ్యంగా విరుచుకు పడాలని ముందే బయలుదేరా డింటికి. కాని మార్గ మధ్యంలో బస్స్టాండ్ ముందు కొచ్చేసరికి అక్కడే ఆగిపోయాడు.

నాన్నతో ఎంతసేపు పితలాటక మాడినా కుదరదు. మహా మొండి ఘటం. అమ్మను తీసుకురమ్మంటే వినడు. ఆలోచించి బస్సెక్కేశాడు.

రాత్రికల్లా అత్తవారింటికి చేరుకున్నాడు. ఉదయమే శిల్పనూ, బాబునూ వెంటబెట్టుకు బయలుదేరాడు. '...మా వాడికి ఉద్యోగం దొరగ్గానే కొనిస్తాం బాబూ!' తనను స్వాగతిస్తున్నప్పుడు అత్తగారి కనుసన్నల్లో నీళ్ళు తిరగాయి.

పడగ్గదిలో 'మనం కొనుక్కొని వాడుకోవాలిగానీ ఒకరు కొనిచ్చినవి వాడుకుంటే గొప్పతనమేముంటుంది? నన్నూ, బాబునూ విడిచి మీరెలా ఉండగలిగారు?' వెక్కి వెక్కి ఏడ్చిన శిల్ప.

'తాతయ్య పోదాం నాన్నా!' కాళ్ళను చుట్టేసిన బాబు మారాము.

గుర్తుకొచ్చి కడుపులో ఎవరో చేయిపెట్టి దేవినట్లనిపించింది.

'నిజంగా నేనెలా ఉండగలగాను?' ప్రశ్నించుకున్నాడు. ఉదయం బయలుదేరే ముందు తాను 'నాకు టీవీ, స్కూటర్ కాని

వ్వాల్సిన అవసరం లేదని అత్తగారితో చెప్పడం మంచిదై౦దనుకున్నాడు.

'మనూరొచ్చింది దిగండి!' ఒక చేత్తో బాబు నెత్తుకుని, మరో చేత్తో బ్యాగు అందుకుంటూ అంది శిల్ప.

పరధ్యానం పరుగెత్తింది. తుళ్ళిపడి సూట్‌కేసందుకున్నాడు. బస్సు దిగారు.

కోడల్నీ, కొడుకునూ చూడగానే ప్రాణం లేచి వచ్చింది బ్రహ్మనాయుడికి.

'తాతయ్యా!' అంటూ చేతు లందించిన బాబు నెత్తుకుని గుండెలకు హత్తుకున్నాడు. కళ్ళలో ఆనందబాష్పాలు కదలాడినాయి. బుగ్గల్ని ముద్దులతో నింపేశాడు.

భోజనాలయ్యేదాకా తండ్రీ కొడుకుల మధ్య మాటలు కరువైనాయి. కేశవరాం ఆఫీసు కెళ్ళబోతుంటే బ్రహ్మనాయుడు భుజమ్మీద కండువా వేసుకుని, చేతిలో సంచీ పట్టుకుని బయలుదేరాడు.

'ఎక్కడికి కెళ్తున్నారు మావయ్యా!' అంది శిల్ప.

'మీ అత్తయ్యను తీసుకొస్తానమ్మా!' బయటపడ్డ బ్రహ్మనాయుడి కుడి చేయి మీసాలు తిప్పింది అనుకోకుండా.

తనలో తానే నవ్వుకుంది శిల్ప.

రాత్రికల్లా రుక్మిణమ్మ దిగింది.

వచ్చేప్పుడు బస్సులో 'బాగా కేశవరాముడంత పని చేశాడాండీ?' అంది ఇంకా నమ్మబుద్ధిగాని రుక్మిణమ్మ.

'ఔను తేరగా వచ్చేది ఎందుకు వదలాలనేదే ఆలోచించాడు

కాని, పాపం! మన వియ్యపురాలి అవస్థ వాడి కర్థం కాలేదు. విష యం తెలియరాగానే వివరంగా నీకుత్తరం రాశాను. నేను రాయ మన్నట్టుగా వివరంగా నువ్వు వాడికుత్తరం రాసినట్టున్నావు.

'ఔను! మీరు రాసిన మర్నాడే నా కందింది మీ ఉత్తరం. వెంటనే ఏ మాత్రం ఆలస్యం చేయకుండా మీరు రాయమన్న ట్టుగా వాడి ఆఫీసు అడ్రసుకు రాసి పడేశాను ఉత్తరం.'

'అందింది కాబోలు - రోగం టక్కున కుదిరింది' మీసాల మీదికిపోతున్న చెయ్యి నాపింది.

'ఎలా?' అంటూ బుగ్గలు నొక్కుకుంది.

'కాంపు కెళ్తున్నానని బయలుదేరి శిల్పనూ, మనవణ్ణీ తీసు కొన్నాడు' టకీమని మీసం మెలేశాడు గర్వంగా, ముక్కుమీద వేలేసుకుంటి రుక్మిణమ్మ.

'మనం ఏడుకొండల కెళ్ళడమేమిటి! పుట్టింట్లో నాల్రోజు లుండమని మీరు నన్నుంచిపోవడ మేమిటి?' ఇంకేదో అనబో యింది.

భార్య కళ్ళలోకి చూస్తూ 'వాడికి బుద్ధి రావడమేవిటి?' అన్నాడు బ్రహ్మనాయుడు మూతి తిప్పుతూ.

'ఇదంతా మన మంచికే' అంది నిమ్మకాయలనైనా నిల బెట్టగలిగిని మీసాల్ని తనివిదీరా చూస్తూ.

గొల్లున నవ్వేశాడు బ్రహ్మనాయుడు. రుక్మిణమ్మ శృతి కలిపింది. ఇంటికొచ్చేసరికి మెట్లమీదనే కనిపించాడు కేశవరాం.

'మీ అత్తగారు కొనిచ్చిన సైకిల్ మోటారేది వాన్నా?' గడపలో అడుగుపెడుతూంటే అడిదాడు అమ్మా నాన్నల్ని చూసి

ఓ పక్క ఆనందిస్తూనే, మరో పక్క ఉడికించా లనుకుంటూ

'నీ అత్తగారిచ్చిన స్కూటర్కు కట్టేశాన్రా!' అన్నాడు చెప్పులు విడుస్తూ.

తృప్తిగా నవ్వారంతా.

తప్పు చేసిన వాడిలా సిగ్గుపడిపోయాడు కేశవరాం.



# కష్టం కథ

బ్రహ్మచారి ముదిరినా, బెండకాయ ముదిరినా పనికిరావురా అన్నయ్యా!

తనకంటే మూడేళ్ళు చిన్నదైన చెల్లి - ఆరిందలా ఉడికిస్తూంటే జనార్ధనంలో అలజడి రేగుతుంది. ఆమాటలు గుర్తుకొచ్చినప్పుడల్లా తన నరాల్ని గ్రైండర్లో వేసి రుబ్బుతున్నట్టనిపిస్తుంది. తనమీద తనకే విశ్వాసం సడలి పోతుందొక్కోసారి.

రక్తం పంచుకు పుట్టిన చెల్లి, తన చేయిపట్టుకు నడిచిన ముద్దుల చెల్లి— చిన్నప్పుడు ఎన్ని మాటలన్నా ఏమనిపించేది గాదు, కాని అదే చెల్లి ముగ్గురు పిల్లల్ని భర్తను ముందేసుకుని తన నంత మాటంటే తన తల తీసేసినంత పనౌతుంది.

తోసుకొస్తున్న నవ్వునాపుకుంటున్న బావ వాలకం కవ్వింపులు విసిరేస్తుంది.

'చూడు జనార్ధనం! నువ్వూ, నేను సమ వయస్కులం - ఇంచుమించు ముప్పై వసంతాల్ని ముచ్చటగా దాటేశాం. నేనేమో పిల్లల కోడినై పోయాను నువ్వేమో పెళ్ళి చూపుల్లో సెంచరీ సాధించావు వందమందిలో నీకే పిల్లా నచ్చలేదంటే ఏమనుకోవాలి? పెళ్ళి కావాల్సిన అబ్బాయిలంతా నీలాగే తయారైతే ఇహ ఈ

లోకంలో పెళ్ళిళ్లేకావు. ఏ ఉద్యమం లేకుండా జనాభా సమస్య తీరిపోతుంది....?

బావ ఉపన్యాస వారవడికి చెవులప్పగించడం మినహా జవాబిచ్చేందుకు పాయింట్స్ దొరకవు.

అదేమిటో....కాలికి బలపం గట్టుకుని తిరుగుతూ ఎన్ని సంబంధాలు చూచినా ఏదీ అతకలేదు. తన ఊహా సుందరి ఏ అమ్మాయిలోనూ కనబడలేదు. కొంతవరకు సరిపెట్టుకున్నా తాను నచ్చిన అమ్మాయి తనను నచ్చలేదు. ఇద్దరికీ నచ్చితే కట్నం నచ్చలేదు.

వంద ఒకటోసారి కట్నం కండిషన్ సడలించాడు. సంబంధం ఖాయమైన వారం రోజులకు కబురొచ్చింది.

'మేమిస్తామన్న కట్నానికే అబ్బాయి ఒప్పుకున్నాడంటే దాని వెనకాల ఏదో లొసుగు ఉండుంటుంది. కాబట్టే వంద సంబంధాల్లో ఏది కుదరలేదు. మాగ్గూడా ఈసంబంధం అవసరంలే'దని.

ఆ తర్వాత రెండేళ్ళదాకా అసలు సంబంధాలే రాలేదు. తాను చొరవ తీసుకుని ప్రయత్నించినా ఫలితం శూన్యమైంది.

....నాకిహ పెళ్ళికాదు జీవితాంతం ఒంటరిగా గడిపెయ్యాల్సిందే. చచ్చినా ఏడ్చేవారెవ్వరుండరు.

వృద్ధాప్యంలో జీవన సంధ్యా సమయం ఒంటరిగా ఆయోమయ అన్న కవి వాక్కు అక్షరాలా నిజమై తీరుతుంది.

మెదడు పొరల్లో ఆలోచనలు పాములా సుడులు తిరుగుతున్న సమయంలో ఆప్త మిత్రుడు ముకుందరావు ఆపద్బాంధవుడయ్యాడు. ఓ సంబంధం పట్టుకొచ్చి జనార్ధనంలో తిరిగి ఆశాలత చిగురించింది. కళ్ళలో పున్నమి వెన్నెల తరంగాలు తళుక్కు

మన్నాయి. అలవాటు ప్రకారం.

తన పూర్వీకుల చరిత్రనంతా చెప్పి వెంటబెట్టు కొచ్చాడో పెద్ద మనిషిని ముకుందరావు. అమ్మాయి తాలూకు విషయాలన్నీ పూస గుచ్చినట్టు చెప్పాడా పెద్ద మనిషి నిర్మొహ మాటంగా.

ఆతని సాహసానికి జోహార్లర్పించాలన్పించింది కాని అప్పు డే అంతపని చెయ్యొద్దని మందలించిందేదో అనుమానం. ఆ అను మానం పెనుభూతం కాక ముందే

'ఈ పరిస్థితి నీచెల్లికే ఎదురైతే నువ్వేం చేసే వాడివిరా!' సూటిగా అడిగాడు ముకుందరావు.

...నిజమే....విధి బలీయం. పరిస్థితితులకు తలవంచక తపవె దెవ్వరైవా.

అనుమానం తాలూకు ఆనవాళ్లు దూదిపింజల్లా వి రి గి పోయినై.

మర్నాడే ఆఫీసుకు సెలవు చీటీలు పంపించి అమ్మాయిని చూచేందుకు బయల్దేరారు. జనార్దనంకు థ్రిల్లింగ్గా ఉంది.

వర్షాల్లేక వరుసగా నాలుగు సంవత్సరాలు నీ టి బొట్టుకు నోచుకోని చెరువులో కుంభ వృష్టి కురిసినట్టనిపించింది. నవనాడు లలో తిరిగి కొత్త రక్తం ప్రవహిస్తుంది.

ఇద్దరు మిత్రుల్ని మోస్తున్న వాహనం ఆ ఊరి వైపు పరు గులు తీస్తుంటే మరుగున పడిన ఊహాసుందరి సరికొత్తగా అలం కరించుకుని ప్రత్యక్షమైంది. ఊహా లోకంలో.

మిలమిల్లాడే సుందరి కళ్ళలో తెలివైన వెలుతురుంది. చేతిలో చెయ్యేసి ఆకుపచ్చని మైదానాలలోకి తీసికెళ్ళింది. సెల

యేరు గలగలలతో పోటీ పడుతూ, గలగలా నవ్వుతూ గిలిగింతలు పెడుతోంది. ఏవేవో కబుర్లు చెబుతూ ఆనంద డోలికలూగిస్తోంది....

....'ఇంత దూరమొచ్చినాం ఒక్క మాటైనా మాట్లాడవేం రా! నువ్వు నా వెనక కూర్చుంటే కొన్ని కిలోల లగేజి మోసుకెళ్తున్నట్టుందే కాని ప్రాణమున్న మనిషిని మోసినట్టు లేదు' అన్నాడు ముకుందరావు ఊరిబయట స్కూటర్‌కు బ్రేకువేసి 'అదో మామిడి తోపు' బాట కిరు పక్కలా వరుసలలో ఉన్నాయి చెట్లు.

జనార్దనం ఊహాసుందరి హుష్కాకైంది.

"అబ్బె....ఏంలేదురా, పద! ఆపావెందుకూ?" అన్నాడు మత్తుగా, గమ్మత్తుగా.

ఆకురాలు కాలానికి కాలం చెల్లిపోయిందప్పుడప్పుడే. చిరునవ్వులు చిందుస్తున్న మామిడి గున్నలు చిగురు పచ్చ పీతాంబరాలు ధరించి కులాసాగా తలలూపుతూ కబుర్లు చెప్పుకుంటున్నాయి. చల్లని గాలి ఒంటికి హాయినిస్తోంది.

స్కూటర్ స్టార్టు చెయ్యబోతుంటే 'ఆగండాగండి' అంటూ ఇద్దరు మనుషులు పరుగెత్తుకొస్తున్నారు దారి కడ్డంగా.

బుర్ర మీసాలు, సిల్కు చొక్కా, మల్లుపంచ మనిషి నోట్లో లంకపొగాకు చుట్ట గుప్పుగుప్పు మంటోంది. నడక వేగం తగ్గించి ఆగాడాయన రైలింజనులా. పాంటూ, షర్టులో పొట్టి గుమ్మడి కాయలాగున్న యువకుని వేళ్ళ మధ్య అంటించిన సిగరెట్ నలిగి పోతోంది.

'ఎందుకూ....?' ముకుందరావు గొంతులో అసహనం ధ్వనించింది. తప్పుకొమ్మని సైగ చేశాడు కళ్ళతో

" మందేవూరు బాబూ...." మల్లుపంచె మందహాసం.

'ఎందుకంట?' తప్పుకోనందుకు కోపమొచ్చింది.

"మీరు చెప్పకున్నా మాకు డెల్సుగానీ, మీ ఇద్దరిలో పెళ్ళి చేసుకోబోయే దెవరూ?" పాంటువాలా పదహారు పళ్ళు బయట పడ్డాయి

'ఎందుకో తెలిశాక, ఎవరైతే మీకెందుకూ?"

'అబ్బ....చెప్పండి బాబూ!' కోరస్. వాళ్ళిద్దర్నీ నరికి పోగులు పెట్టి ఆ పోగుల మీంచి స్కూటర్ తీసికెళ్ళాలనిపించింది ముకుందరావుకు.

"నేనే........' అనేశాడు జనార్ధనం స్కూటర్ దిగి ముందుకొచ్చి ధైర్యంగా.

'చాలామంచిది బాబూ!' ముకుందరావు చెవిదాక వెళ్ళి 'ఆ అమ్మాయి గత చరిత్ర తెలుసా మీకు?' అడిగాడు మల్లుపంచ అంతకంటే పెద్ద రహస్యం ఇంకోటి ఉండబోదన్నట్టు. ఆ ప్రశ్న స్పష్టంగా వినబడింది జనార్ధనంకు.

'ఏమి చరిత్రా' రెండునోర్లు తెరుచుకున్నా యొకేసారి వానాకాలం గోంగ్రుడు కప్పల్లా.

చూడబోతే మర్యాదస్తుల్లాగున్నారు ఎలా చెప్పాలబ్బా.... మల్లు పంచ మొహం పంచరంగుల చిత్రమై పోతుంది.

'చెప్పాలి బాబాయ్. పాపం వీళ్ళ మొహం చూస్తే చాలా మంచి వాళ్ళలా కన్పిస్తోంది. పరోపకారార్థం మిదం శరీరం కదా! మనకు తెలిపిన విషయాల్ని వీళ్ళ చెవిలోవెయ్యడం గ్రామ పెద్దగా మీ కర్తవ్యం" పాంటువాలా కాస్త దమ్ము తీసుకుని "అబద్ధం చెబితే తప్పగాని నిజంచెబితే తప్పేముంది?"అన్నాడు

ఇంకా ఆలస్యం చెయ్యడమెందు కన్నట్లు.

జనార్ధనం ముకుందరావు మొహాల్ని ఆయోమయం కప్పే సింది. మల్లుపంచ లంకపొగాకు చుట్టను నేల మీద పడేసి.

"గత సంవత్సరం ఆ అమ్మాయి నెవరో కిడ్నాపింగ్ చేసుకుపోయి నాల్రోజులుంచుకుని వదిలేశార్ట. అ నాల్రోజులూ.... పాపం....దారుణంగా రేపింగ్ చేశార్ట దుర్మార్గులు. ఆడ కూతురు ఉసురు బోసుకున్న రాక్షసుల పాపం ఊరికే పోతుందా! కాని. అమ్మాయి శీలం" ఇంకేదో అనబోతూ ఆగిపోయాడు. దగ్గుతెర ముంచుకు రావడంతో. ఆ అమ్మాయంటే తనకెంతో అభిమాన ముందని చెప్పాలను కున్నాడు.

'చూస్తూ చూస్తూ ఆ చెడిపోయిందాన్ని ఈ అమాయకునికి కట్టబెట్టాలను కున్నారా పాపాత్ములు?' పాంటువాలా జనార్ధనం ముకుందరావుల మధ్య నిలబడి 'అలాంటి పిల్ల మీ కెందుకండీ! ఈ అబ్బాయి క్లో అంటే కోటి మంది అమ్మాయిలు క్యూలో నిల్చుం టారు.' పొగడ్తలు విసరనారంభించాడు.

'అరె....అలాగా! మాకా సంగతే తెలీదే!'

'హమ్మ-అంతపని జరిగిందా?' ఇద్దరి మిత్రుల మాటలకు సంతో షించి 'ఔనని బుర్రలూపారు, చూపులో జాలి చిలకరిస్తూ. కొన్ని నిముషాలు నిశ్శబ్దంలో కూరుకు పోయాయి. చెట్టుకొమ్మల సందులోంచి తొంగి చూస్తున్న సూర్యకిరణాలు బలం పుంజు కుంటున్నాయి.

'ఐతే.... వచ్చిందారి పెళ్ళిడమే క్షేమమా?' అడిగాడు జనార్ధనం అదోలా చూస్తూ.

'అంతే కద బాబూ?' తేల్చేశాడు మల్లుపంచ అతని బుర్రమీ సాల్లోంచి కొన్ని షళ్ళుతొంగి చూచా యీక్షణం.

థాంక్సండీ....! స్కూటర్ స్టార్టు చేశాడు ముకుందరావు పెదాల మీద చిరునవ్వులు మొలిపించి

'చాలా మేలు చేశారండీ' వెనక కూచున్నాడు జనార్ధనం స్కూటర్ ఊళ్ళోకే దూసుకు పోయింది మల్లుపంచ పాంటువాలా అ కంట్లో దుమ్ముకొట్టి.

విచిత్ర సంఘటనను ప్రత్యక్షంగా చూచినా మామిడి గున్న లూ, చిగుర్లూ విరగబడి నవ్వుతున్నాయి.

* * *

అమ్మాయి గ్లామరస్‌గా ఉంది. ఆవిడ అవయవాల పొందిక కు చకితుడై పోయాడు జనార్ధనం. పొద్దు తిరుగుడు పూవులా తలెత్తి ఒక్క క్షణం ముడుచుకు పోయింది. మరోసారి కన్నెత్తి జనార్ధనం ఆపాదమస్తకం పరిశీలించి చిన్నగా నవ్వింది. అ నవ్వు జనార్ధనంలో జడంగా వడున్న శక్తుల్లో చైతన్యం నిం పింది. జరిగిపోయిన రోజులు.... జ్ఞాపకాల పరదాల్లో దోబూచులా యి. ఎందరో అమ్మాయిల్ని చూచిన అనుభముంది కాని ఇలాం టి అనుభూతి ఎక్కడా కలుగలేదు

తనూ, ఆవిడా భుజాలమీద చేతులు వేసుకుని వర్షంలో తడుస్తూ పరుగెత్తుతుంటే ఎంత బావుంటుందో....!

కథలు చెప్పగల ఆవిడ కలువ కళ్ళల్లో కరిగిపోతూ ఓ జీవి తం కాలం గడిపేస్తే........!

ముద్దబంతి పూవులా విచ్చుకున్న మొహమ్మీద గండు తు

మ్మెదల్లా కదలాడే కళ్ళను మూసేసి గమ్మత్తు చేస్తే......!

స్వగతంలోని భావదీప్తులు ఆకాశాన్నంటు కుంటున్నాయి.

సింహకిశోరంగా బలిష్టంగా ఉన్న జనార్ధనం ఆకారం, తారాపువ్వల్లా దూసుకు పోతున్న అతని చూపులు ఆవిడ నలర్ధి స్తున్నాయి.

ఆవిడ ఎర్రని పెదాల మీద పూచిన చిరునవ్వు మెల్లిగా ఎగ బాగి బుగ్గల్ని రాగరంజితం చేసింది. అ తర్వాత మరింత పైకి పాకి కళ్ళల్లో కలిసి పోయింది.

'మీ పేరు ....... !' అడిగాడు జనార్ధనం.

'అమూహ్య'....అంది ఆ గొంతులో కొన్ని కోయిలల కోరస్ గానముంది.

'ఎంత వరకు చదివారు?'

'ఇంటర్‌పాసై మానేశాను' తియ్యగా పలికింది.

ఈవిడ కూడా దక్కకుండా పోదుగదా! అనుమానం మొలకెత్తి భయపెట్టింది.

"నేను....నచ్చానా....?" అడిగేశాడు గబుక్కన.

అనూహ్య తల సిగ్గుల భారంతో వంగి పోయింది.

గుండెల నిండా ఊపిరి పీల్చి ముకుంధరావు వైపు చూసాడు తృప్తిగా. ఆ చూపు కొరకే ఎదురు చూస్తున్న ముకుందరావు 'మా వాడికి మీ అమ్మాయి నచ్చిందండి' అన్నాడు గర్వంగా అమ్మాయి తండ్రితో.

అనూహ్య తండ్రి మొహం పువ్వు పూవులా విచ్చుకుంది. తల్లి ండెలోంచి తీపి నిట్టూర్పు వెలువడింది. కళ్ళు ఆనందంతో ఎప్పిల్లాయి.

మాట్లాడాల్సిన ముఖ్య విషయాలన్నీ మాట్లాడారప్పుడే ఆలస్యం అమృతం విషమౌతుందేమోననే జంకుతో.

* * *

అమాహ్య అనూహ్యంగా జనార్ధనం అర్థాంగైంది. ఊహ సుందరి స్థానాన్నాక్రమించింది- అనాయాసంగా

పదో తరగతి పరీక్ష పదిసార్లు తప్పి పదకొండోసారి ఫస్టుక్లాసులో పాసైనట్టు ఫీలయాడు జనార్ధనం.

గత పదేళ్ళలో ఎన్నోసార్లు పెళ్ళి చూపులకు తయారైంది అనూహ్య. చూచేందుకదిగో వస్తారు, ఇదిగో వస్తారని ఎదిరిచూడ్డమే కాని ఎవ్వరూ ఇంటిదాకా రాలేదు. తన దౌర్భాగ్యానికి గుండె చెరువైపోయేది. తల్లిదండ్రులు బాధపడుతుంటే తన నాడపిల్లగా పుట్టించిన భగవంతుణ్ని దోషిగా నిలబెట్టేది. మెడలో మూడు ముళ్ళేసిన జనార్ధనం అపర జనార్ధనుడి స్థానం సంపాదించుకున్నాడావిడ గుండెల్లో.

శోభనం గదిలో....

అతని కళ్ళు, జుట్టూ, ముక్కు పెదాలమీద అందమైన మీసంకట్టును రెప్పవాల్చకుండా చూచిన ఆమెకళ్ళల్లో ఆశ, మెరుపు చొరవ తుళుక్కు మన్నాయి.

ప్రత్యేకంగా అలంకరించుకున్న దుస్తుల్లో అనూహ్య అవయవాల పొంకం స్ఫుటంగా, మరీ ఆకర్షణీయంగా కనబడుతోంది. ఉత్సాహం, ఉద్రేకం ఉరకలు వేస్తున్నాయి జనార్ధనంలో.

మల్లెపందిరి, అగరొత్తుల సువాసనలు మత్తెక్కిస్తున్నాయి హంసలా అడుగులేస్తూ దగ్గరైంది అనూహ్య భర్త గుండెన మీద

గువ్వలా ఒదిగిపోయింది–మెల్లికా.

'అనూహ్య....!"

ఊం....!

'నేన్నీకెందుకు నచ్చాను?'

'మీకు నేనెందుకు నచ్చానో, మీరు నాకందుకే నచ్చారు.' అంది–చూపులతో తినేస్తూ.

'నేనొకటడుగుతాను....ఏమీ అకోవుగదూ!'

ఊఁహూఁ!

'నువ్వు కిడ్నాప్‌కు గురైనప్పటి అనుభవాలు వివరంగా చెప్పు....'.

'.... ....'

'భార్యభర్తలమధ్య రహస్యాలుండొద్దుగదా!'

'నిజమే.... కాని నేను కిడ్నాప్‌కు గురయ్యాననీ, చెడిపోయాననీ మీరు నమ్ముతున్నారా?

'స్వయంగా మీనాన్నే చెబితే నమ్మకేంజేస్తాను? అదేమన్నా అబద్ధమా?'

'ఔను'

షాక్ తగిలింది జనార్ధనంకు–నమ్మలేకపోయాడు.

'ఐతే....కన్నతండ్రే అలా ప్రచారం చేశాడెందుకూ?'

'విధిలేక'

'అంటే....!'

'మా ఊళ్ళో రాజకీయకక్షలు ఆడ పిల్లల జీవితాలతో ఆడుకుంటున్నాయి. ఊళ్ళోఉన్న రెండువర్గాలలో మా నాన్న ఒక

వర్గానికి నాయకుడుగా ఉండేవాడొకప్పుడు. ఇప్పుడాయన కారా కీయాలకు దూరంగా ఉన్నా ప్రత్యర్థుల కోపాగ్నికి దూరంగా లేకపోయాడు. నా పెళ్ళి కాకుండాచేసి మా నాన్నను మానసిక సంక్షోభానికి గురిచెయ్యాలని మరోవర్గం ప్రయత్నం. నన్ను చూచేందుకొచ్చే వాళ్ళను ఊరి బయటే ఆపి నేను కిడ్నాప్‌కు గుర య్యాననీ, చెడిపోయాననీ నమ్మకంగాచెప్పి పంపించేవారు–ప్రత్యర్థులు. కనీసం వారిని మా ఇంటిదాకా గూడా రానిచ్చేవారు కాదు'

'అలాగా....? అప్రయోగం నామీదగూడా జరుపబోయారు'

'అందుకే మానాన్న ఎత్తుకుపైఎత్తు వేసి వారు చెప్పదలు చుకున్న విషయం తానే చెప్పడం ప్రారంభించాడు– ధైర్యమున్నవాడే ముందుకొస్తాడని. అందుకే మీకలా చెప్పాడు'

'ఐతే....నిజానికి....!'

'కిడ్నాప్ కథంతా కట్టుకథే'

అద్భుతమైన అనూహ్య కంటి పాపల్ని జనార్ధనం పెదవులు కప్పేశాయి. లైటు వెలుతురుకు సిగ్గేసి గదిలోంచి పారిపోయింది.

(జాగృతి 2 జూన్ 1991)



# ఇరుగు పొరుగు—ఇరవై వేళ్ళు

కాలనీలో బస్సుదిగిన వీరేందర్ తృప్తిగా నవ్వుకున్నాడు తానో పెద్ద ఇంజనీరునని మరిచి....కానీ ఖర్చులేకుండా కోఆపరేటివ్ బాంక్‌లో అప్పు సంపాదించిన అసామీలా. తానేసిన మూడు ముళ్ళు భరించి తనను కొంగుకు ముప్పై ముళ్ళలో ముడేసుకున్న సుందరి మొహంలోకి చూశాడు. గర్వంగా నవ్వి చక్రాల్లా తిప్పింది కళ్ళు 'ఈ సంక్రాంతికి మానాన్న గారి ముక్కు పిండి కలర్ టీ.వి. ఎలా ఇప్పించగలిగానో చూచారా!' అన్నట్టు. దేళ్ళ దాంపత్య ఫలితం— దీప, కృష్ణ కుమార్లు, పరుగెత్తుతున్నారింటివైపు కేరింతలతో.

వీరేందర్ చేతిలోని సూటుకేసు సుందరి భుజానికి వేళ్లాడిన ఎయిర్ బ్యాదు అరుగుమీద నిట్టూర్చాయి. ఇంటి తాళం తీసి లోపలి కెళ్ళాలి.

ఆ కాలనీలో ఇంటింటికీ బోలెడంత ఎడంతో, పుష్కలంగా గాలి, వెలుతురు ప్రసాదించే కిటికీలతో చాలా ఇండ్లున్నాయి. ఆ ఇంట్లో రెండేళ్ళ క్రితం చేరగానే నిర్ణయించుకున్నాడు వీరేందర్. ఈ ఊర్నుంచి ట్రాన్స్‌ఫరయ్యే దాకా ఖాళీ చెయ్యనని. తాను కంపెనీకెళ్లాడు. సుందరి మహిళా మండలి వెళ్తుంది. పిల్లలు బడి

కెళ్తారు. ఇంటి పక్కల వాళ్ళతో స్నేహాలు పెంచుకోవడమంటే సుందరికి ఎలర్జీ. అమ్మలక్కలు పప్పులు, శక్కరి, కాఫీ పొడిలాంటివి బదుళ్ళడిగి హైరానా చేస్తారంటుంది. నాల్గుచేతుల సంపాదన బిజీ తప్ప తనికింకే లోకమూలేదు.

తాళం తీసిలోపలికెళ్ళి-భార్యాభర్తలు ఒకరి మొహాలొకరు చూసుకున్నారు వింతగా, నాల్గుసార్లు ఇల్లంతా కలియదిరిగారు గాను గెద్దుల్లా. బీరువాలు, సూటుకేసులు, గ్యాసుపొయ్యి....మిగితాసామాన్లూ ఎవ్వీలేవు. ఇల్లంతా ఖాళీ- ఊడ్చేసినట్టుంది. డైరీ తీసి క్వార్టర్ నెందరు చూచాడు వీరేందర్.... అదే నెంబరు. జుట్టు పీక్కున్నాడు. నరాలలో చెమట ప్రవహిస్తుంది. బుర్రలో భూగోళం తిరుగుతుంది వేగంగా.

'ఇది మనిల్లే....!' అన్నాడు ఏడుపు మొహంతో.

'అయ్యో అయ్యో! మనిల్లుసెవరు ఖాళీ చేసారండీ?' గుండెలు బాదుకుంది సుందరి. కాస్సేపు పంజెయ్యడం మానేసిందావిడ మెదడు.

'అమ్మా! నా పుస్తకాలేవే?' తొమ్మిదేళ్ళ దీప మంఢిపడింది

'నా బుల్లి సైకిల్లేదు నాన్నా!' ఏడేళ్ళ కృష్ణకుమార్ తాండవ నృత్యం.

పావు గంటలో తేరుకుని పక్కింటాయన నడుగాలని బయల్దేరాడు వీరేందర్ బరువైన అడుగులతో.

'ఎక్కడికి మార్చారిల్లు?' మందహాసం చేసాడు పక్కింటాయన. అగ్గిమీద ఆజ్యం పోసినట్లైంది వీంరేదర్‌కు. పక్కింటాయన కుర్చీచూపించాడు కూచొమ్మని.

'మేము ఇళ్ళు ఖాళీ చెయ్యలేదు....' కూలబడ్డాడు కుర్చీలో. ముక్కుమీద వేలతికించుకుంది పక్కింటాయన పెళ్ళాం. 'మొన్న పగలే కదండీ మీ తమ్ముడు లారీతో వచ్చి ఖాళీచేసుకెళ్ళాడు.... కనుబొమ్మలు ముడేసిందావిడ.

'నాకసలు తమ్ముడే లేడు!' గొల్లుమన్నాడు.

నోరెళ్లబెట్టారా దంపతులు. వీరేందర్ బయటి కొస్తుంటే.

'ఎంతపెద్ద ఇంజనీరైతే మాత్రం ఇరుగుపొరుగు వాళ్లతో ఇరవై మైళ్ల దూరముంటే ఇదే అవస్థ. అయ్యో పాపం! పట్టపగలే దొంగలు దోచినా గుర్తుబట్టలేకపోయాం. తమ్ముడంటే నమ్మేశాం.' బుగ్గలు గట్టిగా నొక్కుకుందా ఇల్లాలు.

(సాధన, జూన్ 89)

# వ్యసనం

"ఇప్పుడేం చెయ్యాలి?"

గుండెల నిండా నిర్వేదంతో జైలు నుండి విడుదలైన పవన్‌కుమార్ ముందు నిల్చిన మొదటి ప్రశ్న. జైలుశిక్ష పూర్తైతం దన్న సంతోష మేకోశానా లేదు. పెరిగిన గడ్డం....తరిగిన ఆత్మాభిమానం. పాత జైలులోంచి కొత్త జైలు కడుగు పెడుతున్నా వన్నాయి.

జైలు ముందే కాస్సేపు నిలబడి....ఆకాశం అంచుల్ని పరీక్షించి నిట్టూర్చాడు. యాంత్రికంగా పార్కువైపు లాక్కెళ్ళాయి కాళ్ళు సిమెంటు బెంచి ఆహ్వానించింది చూపులు శూన్యంలోకి గుచ్చుకెళ్తున్నాయి....

'ఈ రోజు మన బాబు పుట్టిన రోజు.... త్వరగా వస్తారు కద్దూ!....' ఆఫీసుకు తయారై వెళ్తున్న పవన్‌కుమార్ భార్య శృతకీర్తి ఉదాసీనతను చదవ గలిగాడు. తప్పకుండా వస్తానని స్ట్రాంగ్ ప్రామిస్ చేశాడు.

శృతకీర్తి మొహంలో ఓ విద్యుత్కాంతి కన్పించి. వెంటనే మాయమైంది.

'రోజూ తొందరగా వస్తానని వాగ్దానం చెయ్యడం.... అదే రోజు వాగ్దాన భంగం చెయ్యడం మామూలై పోయింది, ఈరోజు

లాగైతే ఒప్పుకునేది లేదు....' శృతకీర్తి గొంతు జీరబోయింది బాధతో.

భార్య కలువ కన్నులలో నీరూరడంతో షాక్ తిన్నాడు,

'మా నాన్న మళ్ళీ పుట్టాడని బుజ్జిగాడికి ఆయన పేరే పెట్టాం. పుట్టిన రోజున ఇంట్లోలేకపోతే మా నాన్నా దండిస్తాడు....' చేతిగుడ్డతో శృతకీర్తి కళ్ళద్ది బుగ్గలమీద ముద్దుల ముద్రలు వేశాడు. శృతకీర్తి ఎద కరిగి జలపాతమైంది.

'తాగుడుకుబానిసై చచ్చిన మీనాన్నగారి పేరు వింటే నాకు చిరాకేస్తుంది....' అంది బుగ్గల తర్వాత పెదవుల నందిస్తూ. సర్వంమైమరచి తియ్యని అనుభూతికి లోనైంది. వెంటనే భర్త నుంచి తప్పించుకుంటూ 'అత్తయ్య వచ్చేట్టుంది.... ఇకచాలు....' అంది చెంపలు తుడుచుకుంటూ.

సాయంత్రం ఐదున్నరైంది. షరా మామూలే. పవన్‌కుమారింకా ఇంటి మొహం చూళ్ళేదు.

పొద్దుటి సుద్దులు గుర్తుకొచ్చి తప్పకుండా వస్తాడనుకుంది శృతకీర్తి. మరో గంట గడిచింది.... బరువుగా.

'పొద్దున వాడాఫీసుకెళ్ళే ముందు గుర్తుచేశావా?' అడిగింది అత్తయ్య యశోదమ్మ బాబును ఆడిస్తూ.

'గుర్తు చేయడమేమిటత్తయ్యా ... గట్టి వాగ్దానం తీసుకున్నాను....'

పలుకరిస్తే బావురుమనే శృతకీర్తి కళ్ళను చూచి ఎందుకడిగానా అని బాధపడింది యశోదమ్మ.

పవన్‌కుమార్ ధోరణికి భయమేసింది యశోదమ్మకు. అతనికి

పదేళ్ళ వయసప్పుడు....

ఆరోజు పెరిగిన జీతాల బకాయలిచ్చారని పార్టీ చేసుకున్నా రట భర్త ఆఫీసులో అంతకు ముందున్న హాబీ అలవాటు తరహా కొచ్చింది. పూటుగా తాగి తూలుతూ వచ్చాడు. వరదకు కొట్టుకు పోతున్న గుడిసెలా. మర్నాటి నుంచి రోజూ ఏనుగెక్కి రావడమే ఎన్నిసార్లు వారించినా.... కోపానికొచ్చినా మాయమాటలు చెప్పి మనసు దోచేవాడే కాని అలవాటు దూరం కాలేదు.

రెండు సంవత్సరాలు గిరుక్కుమన్న తర్వాత....

ఓ రోజు కడుపు నొప్పితో మెలికలు తిరిగి పోతుంటే గుండె లు బాదుతుంటూ ఆస్పత్రికి తీసికెళ్ళారు. తాగుడు వల్ల లివర్ దెబ్బతిందన్నాడు డాక్టరు. ఇకనైనా మానకపోతే ప్రాణాపాయ ముందని చెప్పాడు, ఆ మాటలనీ చెవితో విని ఆచెవిలోంచి వదిలే శాడు. నాల్రోజులు గడవగానే మళ్ళీ మొదలైంది తందాన డాక్ట రన్నంత పనీ జరిగింది. తాను పసుపు కుంకాలకు దూరమైంది.

కొడుక్కిలాంటి గాలి సోకవద్దని వేయి కళ్ళతో కనిపెట్టింది. పవన్‌కుమారు ముందెవరన్నా తాగుడు, జూదం, వ్యభిచారం గురించి మాట్లాడుతుంటే బరబరా లాక్కెళ్ళేదతన్ని. ఏసుకుంటూ.

తన పూజాఫలం వల్ల పవన్‌కుమార్ ఉద్యోగం సంపాదించి ప్రయోజకుడయ్యాడు. ఉద్యోగం దొరగ్గానే శృతకీర్తి జీవితం ము డిపడిందతన్తో.... అంతవరకు బాగానే ఉంది.

పెళ్ళి సందర్భంగా స్నేహితులకు బయట విడిగా పార్టీ ఇస్తానంటే స్వీటూ హాట్సులోనమకుంది రాత్రి పది గండలకు.... అతడొచ్చింతర్వాతగాని తెలీలేదు మందు పార్టీఅని. కొత్త కోడ

లింట్లో ఉన్న సంగతి గూడా మరిచి శివమెత్తిపోయింది. చెట్టం
త కొడుకును. ఆ చెంపా ఈ చెంపా వాయించింది. ఆపర కాళ్లా
కన్పించింది.

'స్నేహితుల బలవంతమ్మీద ఒక్క పెగ్గే తాగా.... ఇక
ముందు తాగనని ఒట్టు పెట్టుకున్నాడు.... చచ్చిన నాన్న మీద.

మర్నాడు ఆఫీసు. కొలీగ్స్‌కు పార్టీ ఇచ్చానని మళ్ళీ ఏను
గు మీదెక్కొచ్చాడు. అమ్మ కోపాన్ని కొస్తుందని.... తానే ఈ సం
గతి ఆమెకు చెప్పి... ఈసారి తాగనని పాదాలు తాకి ప్రమాణం
చేశాడు.

రెండ్రోజుల తర్వాత మళ్ళీ మొదలైంది, కాని అమ్మకు
తెలీకుండా జాగ్రత్త పడ్డాడు. శృతకీర్తి ప్రసవానికి పుట్టింటికెళ్ళిం
తర్వాత దుర్వ్యసనం పురివిప్పి ఆడింది.

రాత్రి తొమ్మిదైంది. శృతకీర్తి అంతరాంతరాళాల్లో భయం
పొడసూపింది. బాబును నిద్రబుచ్చి.

'మీరు ఫోం చెయ్యండత్తయ్యా!' అంది వణికే స్వరంతో.

కొడుకు మీద కోపం తారాస్థాయికి చేరుకుంది యశోదమ్మ
కు. ఎక్కడో తప్ప తాగి ఏముండల కొంపలోనో తొంగుండుంటాడు
వెధవ' అంది. ముక్కుపుటాలెగసి పడ్తున్నాయి.

రోషం పొడుచుకొచ్చింది శృతకీర్తికి.

'ఎలాగూ తాగుతాడని మరో నేరం మోపడం బాగన్పించ
లేదత్తయ్యా!' అంగి కొంగుతో కళ్ళద్దుకుంటూ.'

'నీకు తెలీదమ్మా! నువ్వు పురుటి కెళ్ళినప్పుడు ఆ సరదా
గూడా తీర్చుకున్నాడమ్మా—' బావురుమంది యశోదమ్మ.

'అంటే....'

'ఓ రోజు తాగి పేకాటలో డబ్బు గెలిచాడట. గెలిచిన డబ్బు ఖర్చు చేసేందుకు....' ఇహ చెప్పలేక పోయింది.

శృతకీర్తి గుండెలలో రైలు పరుగెత్తింది. రోషం కరిగి కళ్ళ నుండి బయటికొచ్చింది. తలదించుకుంది.

ఎవరో తలుపు తడుతూంటే వెళ్ళి తీసింది.

వాసన గుప్పుమంది. తూలుతూ తప్పటడుగులు. వేస్తూ లోపలికొచ్చాడు. పవన్‌కుమార్. గాలికి ఊగుతున్న చెట్టులా కన్పించాడు నిలబడితే. ఓ వెకిలి నవ్వు నవ్వి....

'మన బాబు పుట్టిన్రోజుకు మా ఫ్రెండ్సుకు పార్టీ ఇచ్చాను..... అంటూ శృతికీర్తి వైపు చూచాడు. కళ్ళలో కళ్ళు కలిపే ప్రయత్నం విఫలమైంది. ఫుల్ బాటిల్ ఊపుకుంటూ లోపలికెళ్ళ బోయాడు.

ఆకాశం కూలి శృతకీర్తి మీద పడింది. మస్తిష్కంలో సప్త సముద్రాలొకేసారి పొంగికుంగినాయి.

'పశువుకో దెబ్బ మనిషికో మాట.... బాబు పుట్టిన్రోజని తెలిసుండి గూడా....చీ సిగ్గులేదూ?' అనహ్యించుకుంది.

వెనక్కు తిరిగి తుపుక్కున ఉమ్మేసాడు.

'ఏ జన్మలో ఏం పాపం చేశామో .. మా ఉసురుభోసుకున్నావు గదరా!....' అరిచింది యశోదమ్మ

'నీకేం బుట్టిందే ముసలిముండా....' బండబూతుల పారాయణంలో అత్తా కోడళ్ళు కొట్టుకుపోయారు.

'అష్టవ్యసనాలకు మారురూపం మీరే... తాగుడుకు తోడు

జూదం. వ్యభిచారం... మీరు మనుషులా.... పశువ్వా?' ఏమం. టుందో తనకే తెలీడంలేదు శృతకీర్తికి.

'దౌర్భాగ్యపు ముండా....' బండబూతుల స్థాయి పెరిగింది. ఫుల్‌బాటిల్ టేబుల్‌కు కొట్టి శృతకీర్తి కడుపులో పొడిచాడు.

'అమ్మా...' పడిపోయింది శృతకీర్తి కొట్టుకుంటుంది కాళ్ళూ, చేతులు.

'ఎంత పంజేశావురా రాక్షసుడా...' పరుగెత్తుకొచ్చింది యశోదమ్మ. శృతకీర్తి కడుపులోంచి బయటికొచ్చి యశోదమ్మ కడుపులోకి దిగబడింది అడుగు ఊడిన సీసా.

'భగవాన్....' అంటూ పడిపోయింది.

తలకోసిన మేకల్లా రెండు శరీరాలు కొట్టుకుని కాస్సేపటికి కదలకుండా పడున్నాయి.

* * *

కల్లు మామానండోయ్ బాబూ, కళ్ళు తెరవండోయ్!' గేయ మాలికను కర్ణపేయంగా వినిపిస్తుంది పార్కు రేడియో.

నాలుగు సంవత్సరాలు నాలుగ్గోడల మధ్యన గడిపిన పవన్‌కుమార్ దృష్టి మీద పరుగెత్తుతున్న వాహనాలవైపు మళ్ళింది. తిరిగి కబుర్లు చెప్పుకుంటూ పార్కులోకి వస్తూపోతున్న జంటల వైపు మరలింది

'శెనక్కాయ బాబయ్యా....' అంటూ శెనక్కాయల బుట్ట చూపించాడు ఎనిమిదేళ్ళ కుర్రాడు, ఏదో గుర్తుకొచ్చింది, పవన్ కుమార్ మొహమ్మీద ఆశారేఖ మెరిసింది, పరుగులాంటి నడకతో వాథ శరణాలయం వైపు దారి తీశాయి. కాళ్ళు (ప్రభ 5-9-89)

# సినిమా సంబరం

హన్మంతుకు థ్రిల్లింగా ఉంది.

థ్రిల్లింగంటే అంతా ఇంతాగాదు-అడుక్కుతినే వాడికి అమరలోక సుఖం లభించబోతున్నంత.

ఏకంగా సూపర్ స్టారై సినీరంగాన్ని ఏకఛత్రాధిపతిగా ఏలుతున్నంత అనుభూతి.

అగ్రశ్రేణి సినీ తారల జీవిత చరిత్రలెన్నో ఆసక్తిగా చదివి.... విశ్లేషించి చూశాడంతకు ముందే. విశ్లేషణలో తేలిందేమిటంటే-ఎక్స్‌ట్రాగా ఫీల్డులో చేరిన ఆడారి విధవ ప్రకృతి నిచ్చెన మెట్టు ఒక్కొక్కటే ఎక్కి తారాపథాన్నందుకో గలుగుతాడు. అగ్రశ్రేణి తారలలో అలాంటి వారిదే మెజారిటీసు. అందుకే అంత ఇదీను. హీరో వద్ద పెర్సనల్ అసిస్టెంటుగా చేరిన అమాయకుడు కాలం కలిసిరాగానే హీరోగా మారిపోగలడు. స్టూడియో ముందు బఠానీలమ్ముకున్న భద్రయ్య సినీ నిర్మాతగా అవతారమెత్తిన దాఖలాలున్నాయి.

అలాంటిది.... తనగ్గూడా అలాంటి శుక్రమహర్దశ రాదనే అనుమాన మెందుకూ? చెప్పొచ్చే దేమిటంటే- హన్మంతుకంత మంచి అలోచన వచ్చినందుకు.... సరాసరి థ్రిల్లింగ్ దూసుకొచ్చింది. అదీ అల్లాటప్పాగా రాలేదు.

నిన్నంటే....నిన్ననే ఓ సినిమా దర్శకుడు వాళ్ళ కాలేజీ కొచ్చాడు. వచ్చిన వాడల్లా విద్యార్థుల మొహమైనా చూడకుండా నేరుగా ప్రిన్సిపాల్ గదిలో జొరబడ్డం- అందరికీ ఆశ్చర్యమేసింది. కాస్సేపట్లో ఆశ్చర్యం ఆనందంగా మారింది.

ప్రిన్సిపాల్ తమ క్లాసురూంలోకొచ్చి సినిమా డైరెక్టర్ పార్థసారధిగారు తీస్తున్న సినిమాలో 'ఒక దృశ్యంలో మీక్లాసులోని కొందరు నటించాలని అడుగుతున్నారు. సంస్కృతం ఆప్షనల్ విద్యార్థులంతా ఓసారి లేచినుల్చోండి.' అన్నాడు నశ్యం ఖర్చుచేస్తూ.

'ఎప్పుడు సార్?' అహల్య అడిగింది కమ్మగా....తనగ్గూడా అవకాశమిస్తే బావుండు ననుకుని.

'విద్యార్థులు మాత్రమే....విద్యార్థినులు కాదమ్మా! గురుకులాశ్రమంలో బ్రహ్మచారులు వేద మంత్రాలు వల్లె వేస్తున్న దృశ్యంట.'

'బై దిబై బ్రహ్మచారిణుల దృశ్యం గూడా చిత్రీకరిస్తే ఆకర్షణీయంగా ఉంటుంది గదా!' మండోదరి ఉచిత సలహా.

పచ్చిమిరపకాయ పరపర నమిలినంత పనైంది. ప్రిన్సిపాల్కు.

'పిచ్చిపిచ్చి సలహాల కోసం కాదాయన వచ్చింది. నువ్వు కూచో.'

మండోదరి ముఖారవిందం మాడిపోయిన వంకాయైంది.

హనుమంతుడిగూడా సంస్కృతం ఆప్షనలే కాబట్టి లేచి నిల్చున్నాడు. అతనితోపాటు మరో ఎనమండుగురు....మొత్తం తొమ్మిది.

కళ్ళతోనే లెఖ్ఖవేసి.

"ఈ నవగ్రహాలు పరిక్షిస్తారా?" అడిగాడు ప్రిన్స్‌పాల్ పక్కనే ఉన్న డైరెక్టర్ని, చాలని తలూపాడాయన.

'మరి డైరెక్టర్ గారితో వెళ్ళండని' హుకుం జారీచేసి జారుకున్నాడు ప్రిన్స్‌పాల్.

తొమ్మండుగురినీ వేరేగదిలోకి తీసికెళ్ళాడు డైరెక్టర్ పార్థసారథి.

'మీరు.... రేపు ఉదయం తొమ్మిదికిక్కడే ఉండండి. మా వ్యాన్ వచ్చి మిమ్మల్ని స్టూడియోకు తీసుకెల్తుంది.' అనగానే.

'మేమెంత సేపు నటించాల్సొంటుంది సార్?'

'మా పాత్రలేమిటి సార్?'

'మా ముందు గురువు పాత్ర ఉంటుందా?'

'స్టూడియోలో మాకన్నీ చూపిస్తారా?

సినిమా. పేరేమిటి సార్?'

'హీరో హీరోయిల్నెవరండీ?'....

తలా ఓప్రశ్న వడ్డించారు తొమ్మండురు.

'మీరైతే రెడీగా ఉండండి. ఆ విషయాలన్నీ తెలుసుకుంటారు.' అని చరచరా వెళ్ళిపోయ్యాడాయన.

ఐతేనేం... ఎంచక్కా తను సినీఫీల్డులో అడుగు పెట్టబోతున్నాడు. దొరికిన చాన్సు చిన్నదైనా అద్భుతంగా నటించి అందరి దృష్టి నాకట్టుకుంటే ఇంకో సినిమాలో కొంచెం పెద్దపాత్ర ఇస్తారు. అందులో గూడా బాగానటిస్తే సైడ్ హీరో చాన్సు తగలొచ్చు ....మరో సినిమాలో. అందులో తన కళాకౌశలాన్నంతా

ఉపయోగించి అత్యద్భుతంగా నటిస్తే కొన్ని సినిమాల్లో హీరో గా కన్పించవచ్చు. హీరోగా గెంతిన మొదటి సినిమా హిట్టయితే ఎందరో నిర్మాతలు తనింటి ముందు క్యూలో నిల్చుంటారు.

సంవత్సరం తిరిగెల్లోగా మూడంతస్తులమేడ.... ముద్ద బంతి పూవంటి హీరోయిన్‌తో పెళ్ళి.... ఇంకేముంది? జీవితమంతా నందనవన విహారమే. థ్రిల్లింగ్ ..థ్రిల్లింగ్ .. థ్రిల్లింగ్.

స్టూడియోలా కెళ్ళగానే ఫ్లోర్లన్నీ చూడాలనీ, షూటింగ్‌లో పాల్గొన్న తారలతో కులాసాగా కబుర్లు చెప్పుకోవాలనీ.... చెవులు కొరుకున్నారు, నవగ్రహాలు వ్యాన్‌లో.

కాలేజీ వార్షికోత్సవాలలో, ఇతర ఫంక్షన్స్‌లో నాటకాలేసి ప్రేక్షకుల వేళ్ళు ముక్కులమీద వాలేలా చేసిన హన్మంతునే తమ లీడర్‌గా ఎంచుకున్నారు కాబోయే అగ్రతారలు.

వ్యాన్ డైరెక్టుగా పరుగెత్తి మేకప్ గది ముందాగింది. లోపలికెళ్ళారు బెరుకు బెరుగ్గా.

'మా డైరెక్టర్‌గారు చెప్పిన కాలేజీ స్టూడెంట్స్ మీరేనా ..?' అడిగాడొకాయన ఎదురొచ్చినంత పంజేసి.

'ఔనండీ మేమే ఈరోజు షూటింగుందన్నారు, మీరూ ... మీరు' అందరి కంటే ముందున్న హన్మంతు గుండె లబ్‌డబ్ మం టున్నా.... నాలిక తడారిపోతున్నా ఖాతరు చెయ్యకుండా అడి గేశాడు.

'నేను అసిస్టెంటు డైరెక్టర్ని. కమాన్.. మీరు త్వరగా మేకప్‌కండి.' అని మేకప్‌మాన్‌కు పరిచయం చేసి మాయమయ్యా డాయన.

'ఇదేమిట్రా?....టీ, కాఫీలేవీ ఇవ్వరా?' రామ్మూర్తి నీరు గారి పోతున్నాడు.

'నటులంటే....వీళ్ళకసలు గౌరవమే లేనట్టుందే!' దేవదాసు పణుగుడు.

స్టూడియో కెళ్ళగానే ఇంటల్లుడిలా మర్యాదలందుకోవచ్చనుకున్న హన్మంతు నరాల్లో నిరాశ కుతకుతలాడినా....ఆశమాత్రం చావలేదు.

'అబ్బా....కాస్సేపాగండిరా తిండి పోతుల్లారా! ఎవరన్నా చూస్తే మనం తిండికోసమే వచ్చామనుకుంటారు. ఐనా.... టైమెంతైందనీ! అప్పారావ్ తొమ్మిదిన్నరే గదా! స్టూడియోలో టిఫిన్ టైం పదికాచ్చు నోమ్మాసుకోండి కాస్సేపు.' అన్నాడు బింకంగా

'రండయ్య బాబులూ! మేకప్ చెయ్యాలి. ముందు మీరు శుబ్బరంగా మొహాలు కడుక్కరంటి!' పురమాయించాడు అసిస్టెంట్ మే.ప్మాన్. అతని బొమ్మేదో అరిగిపోతున్నట్టు- అతని మాటలలో ఏకోశానా మర్యాదా, మన్ననలు కనబడలేదు. వినబడలేదు.

మొహాలు కడుక్కరాగానే మేకప్ ప్రారంభమైంది.

ముగ్గురు నలుగురున్నారు మేకప్ చేసేందుకు. నవగ్రహాల మొహాలకు రంగులు వేస్తున్నారు... కాదు.... లెంపలు వాయిస్తున్నారు. అరచేతులకు రంగులు పూసుకుని లటలటలాడిస్తుంటే చెంపలుబ్బి పూర్ణంబోరెలై పోతున్నాయి.

'అబ్బా! ఇదేమిటండీ....మేకప్ చెయ్యడమంటే ఇంతగట్టిగా బాదడమా?' భరించలేకపోయాడు హన్మంతు.

తాగుతున్న బీడీకి కాస్త విశ్రాంతి నిచ్చి.

'ఇది సినిమా మేకప్పా, మజాకా? వేషానికి తగిన ఎఫెక్ట్ మేకప్‌తోనే రావాలాయె. లేకపోతే మా మేకప్‌మాన్ మాలెంపల పచ్చడి చేసి పూరీలలో నంజుకు తింటాడు' మరికాస్త వేగం పెం చాడాయన.

మొహమ్మీద, మెడలు-భుజాలమీద రంగుచేతులు పడ్తిస్తు న్నాయి. మేకప్పయే సరికి గోడగడియారం పన్నెండుసార్లు అవలించింది. ఆత్మారాముని గోల అధికమైంది. పొద్దుట్నుంచి వచ్చి మంచి నీళ్ళైనా వాడికి సమర్పించుకోనందుకు వీరవిహా రం చేస్తున్నాడు. ఆకలిపందికొక్కు పేగుల్ని కొరుక్కు తింటుంది.

బోడిగుండు మధ్యలో పిలక....బిళ్ళగోచిధోవతి....నుదురు' భుజాలు, చేతులు, ఛాతీలమీద విభూతిరేఖలు ..., పేడుమూతులు

మూడు నిముషాల బాగోతానికి మూతిమీసాలూడినాయన్న సామెత గుర్తొచ్చినా బయటి కనబుద్ధి కాలేదు.

'ఆశ్రమ విద్యార్థుల మేకప్ బాగా కుదిరిందోయ్!' గురు వుగా నటిస్తున్న సైడ్‌హీరో మెచ్చుకోలుకు- ఎవ్వరికీ మేకప్ చెయ్యని అసిస్టెంట్ మేకప్‌మాన్ తల కృతజ్ఞతా భారంతో వేలా డింది.

నవగ్రహాల నరాలు ఆకలి స్వరాలు వినడిస్తున్నాయి.

'ఇంతకీ అసలు మేకప్‌మ్యాన్ ఎక్కడండీ?' తనకు చివరి మెరుగులు దిద్దుతున్న మనిషినడిగాడు హన్మంతు-ఎంత వద్దను కున్నా తోసుకొస్తున్న కోపాన్నణచుకోలేక.

'అసలు మేకప్‌మానంటే అల్లాటప్పా మనిషనుకన్నారా?

ఆయన హీరో-హీరోయన్ల మేకప్ మాత్రమే చూస్తుంటారు. ఇదో .... మేమంతాలేమా మీలాంటి ఎక్స్ట్రాగాళ్ళకు సింగారిం చేందుకు?'

మనసు చివుక్కుమన్నా పెదాలమీద బలవంతపు చిరునవ్వు మెరిసింది.

'మేకప్ ఇంత బాగా కుదిరినా వీళ్ళ మొహమ్మీద. కళనే లేదేమిటోయ్?' ఆసిస్టెంటు మేకప్‌మాన్ భృకుటి ముడిపడింది.

'పొద్దుట్నుంచి కడుపులో కనీసం కాఫీనీళ్ళన్నా పడందే మొహమ్మీద కళ ఎక్కడుంటుందండీ? అసలే నీరసంతో మేం చస్తుంటే...' గుర్రుమందొక గ్రహం.

'అరెరె! మీరు... కాఫీ....టిఫిన్లు లేకుండానే మేకప్ రూం లో కొచ్చారా?' అంటూ అంగలేసూ వెళ్ళి అసిస్టెంటు డైరెక్టర్ని లాక్కొచ్చాడు-అసిస్టెంటు మేకప్‌మాన్.

'ఏమయ్యా బాబులూ! కనీసం కాఫీ-టిఫిన్లు కాకుండానే ఇంటినుండి బయల్దేరారా?'

అలా అడిగిన అసిస్టెంట్ డైరెక్టర్ గొంతు పిసికెయ్యాల న్పించింది. సహనంకు ఒళ్ళు మండిపోతుంది- వేడిపొయ్యి మీది రొట్టె పెంకలా.

'అంతపొద్దునే మాకోసం ప్రత్యేకంగా తయారుచేసి .... కాఫీ టిఫిన్లిచ్చి పంపిస్తారా.... మా అమ్మానాన్నలు? ఐనా.... ఇంత పెద్ద సినిమా తీస్తున్నారు.... ఎంతో మంది పరిశ్రమలో పంజేస్తున్నారు. వందలాది నటులు పాల్గొంటున్నారు. వారంతా ఇంటివద్దే టిఫిన్లూ, భోజనాలు వేసొస్తున్నారా?' ఘూడించాడు

హన్మంతు కుడిభుజం భీమేశ్వర్.

'ముందు ముందు పైకిరావాలనుకున్న తన భవిష్యత్తు గతేమౌతుందోనని ఓపక్క హడలిపోతున్నాడు హన్మంతు కాని ...కడుపులో ఏదన్నా పడందే నిలదొక్కుకోవడం అసాధ్యమని పించి గమ్మునూరుకున్నాడు

అరగంటలో కాఫీ-టిఫిన్లొచ్చాయి-మేకప్ రూంకే. వాటి పని పట్టింతర్వాత అసిస్టెంటు డైరెక్టర్ చిత్రీకరించబోయే సన్ని వేశం గురించి వివరించాడు.

ఒక సంస్కృత శ్లోకాన్ని గురువుగారు చెబుతూంటే తొమ్మండుగురు శిష్యులు అనుసరించాలి. గురువుగారు శ్లోకం, అర్థతాత్పర్యం వివరిస్తుండగా ఒక రాజభటుడొచ్చి గురువుగార్ని తీసికెళ్తాడు-రాజుగారతణ్ని వెంటనే రమ్మన్నారని.

'ఐతే.... మేం చెప్పాల్సిన డైలాగులేమీ లేవాసార్?' ఉసూరు మంది హన్మంతు ఆత్మవిశ్వాసం.

'గురువుగారి శ్లోకాన్ని మీరనుసరించడం తప్ప ఇంకేమీ లేదు. ఇది సరిగా చేసిన వారికి....తర్వాత తీసే సినిమాలో డైలా గులున్న పాత్రలిచ్చే అవకాశముంది.'

హన్మంతులో ఆశారేఖ తొంగిచూచింది.

ఎవరెవరు ఎక్కడెక్కడ కూచోవాలో రిహార్సల్ చేయించి చూపించాడు అసిస్టెంటు డైరెక్టర్. అందరికంటే ముందు హన్మం తునే కూచోమ్మన్నాడు. అందుకు తబ్బిబ్బై పోయింది హన్మంతు ఆత్మవిశ్వాసం.

'నేనొచ్చి మిమ్మల్ని తీసికెళ్తాను. అప్పటిదాకా ఇక్కడే

ఉండండి.' అని హడావుడిగా పరుగెత్తాడాయన.

బయటేదో షూటింగు నడుస్తుంది. అదన్నా చూస్తే బావుం డనిపించింది. కాని ఎవరినడిగి వెళ్ళాలో తెలీక కిటికీల్లోంచి చూ స్తుండి పోయారు.

షూటింగ్ చూస్తూ ఆమాటా ఈమాటా మాట్లాడు కుంటుంటే- మధ్యాహ్నం రెండున్నరైంది.

'ఆకలేస్తుందిరా హన్మంతూ! వాళ్ళంతా భోజనాలు చేసిన ట్టుంది. మనసెవ్వడూ పిలువలేదేమిట్రా.... మనకు మేకప్ చేసిన వాళ్ళుగూడా వెళ్ళిపోయారప్పుడే....' రామ్మూర్తి గొంతు గురగుర లాడింది.

'ఎందుకొచ్చిన బాధరా ఇదంతా! వెళ్ళిపోదాం పదండి!' రోషం పొడుచు కొచ్చింది దేవదాసుకు.

హన్మంతుక్కూడా కోపం రాక పోలేదు....కాని తన భవిష్య త్తు గుర్తుకొచ్చే సరికి చప్పున చల్లారింది.

'కాస్సేపాగండిరా! ఇంత సేపున్నాం. ఇంకాస్సేపుంటే షూటింగై పోతుంది. అప్పుడు వెల్దాం. అవకాశమనేది మనల్ని వెతుక్కుంటూ రాదు. దాన్నే మనం వెతుక్కుంటూ వెళ్ళాలి. జీవి తంలో చిన్నపాటి అవకాశం దొరికింది. సినిమాలో మనం కన్పిం చేది మూడునిముషాలే ఐనా మూడుకోట్ల మందైనా చూస్తారు మనల్ని, దీన్నే ఆసరాగా తీసుకుని పైకిపోయే ప్రయత్నం చేద్దాం.' మందలింపులో వేడుకోలుంది.

'భవిష్యత్తు లేదు, పిండాకూడు లేదు. నేను వెళ్తారా!' మేక ప్పు విప్పుకో బోయిన రామ్మూర్తిని మరింత బ్రతిమి లాడాల్సొ

చ్చింది.

మూడున్నరకు వచ్చి తీసికెళ్ళాడు అసిస్టెంటు డైరెక్టర్- షూటింగ్ స్పాట్‌కు.

* * *

ఆరోజే 'రాణీగారి రంకుమొగుడు' సినిమా విడుదల.

మొదటిరోజు....మొదటి ఆట చూసి తీరాలనే ఉబలాటంతో థియేటర్ కెళ్ళాడు హన్మంతు. డైరెక్ట్‌గా మానేజర్ గదిలోకెళ్ళి స్టయిల్‌గా కూచున్నాడు. 'రాణీగారి రంకుమొగుడు' సినిమాలో తాను నటించినట్టు అంతకు ముందే చెప్పించాడు మానేజర్తో.

స్నేహితులు, బంధుబలగం ప్రచారంతో ఊరంతా చాటింపువేసినట్టయింది.

'మనూరి వర్ధమాన నటుడు హన్మంతు నటించిన అద్భుత చిత్రం' అని ప్రచారం చేశారు థియేటర్ వాళ్ళు. స్వయంకృషితో సినిమా రంగంలో ప్రవేశించాడని ఆకాశాని కెత్తేశారు బాల్య స్నేహితులు.

'హైద్రాబాదులో చదువుకుంటే ఇలాంటి అవకాశాలొస్తాయి. అదే మన టౌన్లో చదువుకుంటే నాకీ అవకాశం దొరికేది కాదన్నాడు వారితో.

హన్మంతు వెంట మిత్రమండలి గూడా ఉంది-హన్మంతుని వెంట కోతిమూకలా.

కట్టుడు పళ్ళికిలించి సగౌరవంగా ఆహ్వానించాడు థియేటర్ మానేజర్. కూల్‌డ్రింక్స్ పరుగెత్తుకొచ్చాయి. ప్రేక్షకులతో క్రిక్కిరిసిన హాల్లో ప్రత్యేక సీట్లు ఏర్పాటైనాయి.

'అదో ఆయనే హన్మంతంటే–ఈ సినిమాలో నటించాడట.'

'అబ్బో....ఈయనా. అదృష్టవంతుడే! ఏ అదృష్టవంతురాలు ఎగరేసుకుపోతుందో ఆతణ్ని.'

చెవులు కొరుక్కుంటున్న ఆడపిల్లల మాటలు హన్మంతు గుండెలలో గిలిగింత పెట్టాయి.

సినిమా ప్రారంభమైంది. హన్మంతు నటించిన సన్నివేశం ఎప్పుడొస్తుందాని ఒళ్ళంతా కళ్ళుజేసుకు చూస్తున్నారంతా. అదృశ్యం కనబడగానే చల్లేందుకు తెచ్చిన పూలు హన్మంతు దండు చేతులలో మురిసిపోతున్నాయి. గంటన్నర దాకా ఆ సన్నివేశం రాలేదు. ఇంటర్వెల్లో అడిగాడు థియేటర్ మానేజర్.

'కథలో ఏ సందర్భంలో మీ ప్రాత అంటే.... మీరు కనిపిస్తారు సార్!' అని.

అసలా సినిమా కథేమిటో.... కథలో గురుశిష్యుల దృశ్యమెందుకు చూపిస్తున్నారో-హన్మంతుకు తెలీదు. తెలుసుకోవాలనే అడిగాడు షూటింగ్ రోజున అసిస్టెంటు మానేజర్ని.

'ఆదంతా నీకుందుకయ్యా? సినిమా రిలీజ్ కాగానే చూడండి. మీకే అర్థమైపోతుంది.' మొహం చిట్లించాడాయన.

'మిగతా హాఫ్‌లో కనబడతానండీ' అనూరుకున్నాడు.

సినిమా ఐపోయింది. అందులో హన్మంతు నామరూపాలేవీ కనబడలేదు–వినబడలేదు

'వీడేదో కూస్తే మనం నమ్మి వెధవలమై పోయాం.' అన్నాడొక మిత్రుడు.

'ఫ్రీగా సినిమా చూడాలంటే ఇంత పెద్ద అబద్ధమాడాలా?'

గుడ్లురిమాడు థియేటర్ యజమాని.

ఏడుపు కళ్ళదాకా వచ్చి ఆగిపోయినట్టనిపించింది హన్మంతుకు. అవమానాన్ని భరించలేక.

"నిజంగా నేనిందులో నటించ్రానా." అనబోయి ఆగిపోయాడు ఎవరూ నమ్మేట్టులేరని.

'సంగతేమిటి?' అని ఫోన్ చేశాడు నవగ్రహాల్లో ఒక గ్రహమైన రామ్మూర్తికి.

'సినిమా నిడివి ఎక్కువైందని కొన్ని పనికిరాని షట్స్ కత్తిరించారట. మనం నటించిన సీనుగూడా అబాపద్దేనట.' రామ్మూర్తి సమాధానం హన్మంతు అంతరాళాల్లో గందరగోళం సృష్టించింది.

జాగృతి (19-25 నవంబర్ 1990)

# బాధ్యత

డాక్టర్ జగదీప్ ఎం.డి. ఎఫ్.ఆర్.సి.పి. బంగళా గుండెకు వ్రేలాడదీసిన సైన్ బోర్డును దూరన్నుండే చదివగానే 'చెడ్డీలు కట్టుకున్నప్పుడు, చిర్రాగొనే ఆటలో తనతో ఓడిపోయిన బడుద్దాయి ఇంత పెద్ద డాక్టరై కొండంత మేడ కట్టేశాడు....' అంతరాళాలలో చిన్నపాటి అసూయ చిరచిరలాడింది.

'ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే. వాడెంత పెద్ద డాక్టరైతేనేం, నాకు ప్రాణస్నేహితుడే గదా! అనుకోగానే గర్వం గురగురలాడింది.'

జగదీశ్‌ను చూచి చాలా రోజులైంది. బాతఖానీకెవరూ దొరకలేదని కాస్సేపు లాక్కొచ్చినాయి.

'అయ్యగారున్నారా?' కాంపౌండర్నడిగాడు-స్వాతిశయంగా

'ఇంట్లో లేరండీ....కూర్చోండి.' అరిగిపోయిన రికార్డ్ లాగనేసి కుర్చీ చూపించాడు.

కింద పోర్షనంతా నర్సింగ్ హోంకు కేటాయించుకున్న డాక్టర్ జగదీశ్ పై అంతస్తులో ఉంటున్నాడు కుటుంబ సమేతంగా ఆసమయంలో పేషంట్లుండరు. ఎమర్జెంట్ కేసులొస్తే పిలిపించుకుంటారు-కాంపౌండర్.

చెదరిన మనసుతో ఇంటి నుండి బయల్దేరిన సహదేవ్

కా స్సేపు టైంపాస్ చేద్దామని వచ్చాడు.

గోడకు వేళ్లాడుతున్న గడియారం ఏడున్నర చూపిస్తోంది. సీలింగ్ ఫాన్ గాలి ఒంటిని చల్లగా నిమిరింది. చూపులు శూన్యం లోకి చొచ్చుకు పోతుంటె మాండవి మస్తిష్కంలో కదిలింది.

'ఏమండీ....' ఆఫీసునుండి రాగానే గోముగా పిలిచి కాఫీ అందించింది మాండవి, భార్య పిలుపు ఏకొత్త చీరకో, కొత్త రకం నెక్లెస్‌కో ప్రతిపాదనలాగనిపించింది, పెదవుల మీద చిరునవ్వు తొంగి చూచింది. వాతావరణం అనుకూలంగా ఉంది. ఒకచేత్తో కాఫీ కప్పందుకుంటూ మరోచేత్తో మాండవి నడుమును చుట్టెయ్య బోయాడు-తను.

'ఛ....ఏమిటా చిలిపి చేష్టలూ..పిల్లలు వచ్చే టైమైంది,' మాండవి బుగ్గలు ఎర్రమందారాలైనై. దూరంగా జరిగి ఎదురుగా కూర్చుంది. కప్పు ఖాళీ అయేదాకా కళ్ళే మాట్లాడుకున్నాయి.

'ముచ్చట సంబరాన మొగుణ్ణి మరిచినట్టూ... అసలు సంగతి మరిచి పోతున్నా'వంది మాండవి అంతరంగం. మొహం నిండా గాంభీర్యం అలుముకుంది, ఖాళీ కప్పందుకుంటూ

'మన పిల్లల సంగతండీ ...!' అంది

ఆవిడ మొహంలో అప్పటి కప్పుడే మారిన రంగుల్ని చది వేస్తూ

'పిల్లల సంగతా....? ఇంకా ట్యూషన్నుంచి రానట్టుంది గదా?' బయటికి పోబోయాడు

'అదికాదండీ... వాళ్ళ చదువు గురించి మీరేమన్నా పట్టించుకుంటున్నారా?'

కొత్త ఆరోపణ అడుగు ముందుకు పడనీయలేదు.

'నాపిల్లల సంగతి పేను పట్టించు కోవడం లేదా?'

'ఔను...!'

'గుమాస్తా ఉద్యోగం చేస్తున్నా ఇద్దరు పిల్లల్ని మంచి పేరున్న బడిలో చేర్పించా. ట్యూషన్‌కు పంపిస్తున్నా జీతంలో ఆరోవంతు పిల్లల చదువులకే ఖర్చైపోతుందన్న సంగతి నీకు తెలీదా?' చిరాకేసిందతనికి.

తన వాలకానికి జాలేసిందావిడకు.

'ఖర్చవుతున్న మాట అక్షరాలా నిజం. కాని మీరెప్పుడన్నా వాళ్ల ప్రగతి పత్రాలు చూశారా? ప్రతిసారి నేనే సంతకం జేసి పంపిస్తున్నా.'

'పొద్దట్నుంచి ఆఫీసులో అడవ చాకిరీ చేసొచ్చా. 'సాయంత్రమన్నా కాస్సేపు ఫ్రెండ్స్‌తో కులాసాగా గడుపుదామనుకుంటే ఇదోగోల' అనుకుని పైకి 'ఐతే ఏమైందట!!' అనేశాడు.

'యూనిట్ అర్ధవార్షిక పరీక్షలలో చాలా తక్కువ మార్కులు తెచ్చుకుంటున్నారు. కొన్ని సబెక్టులలో ఫెయిలైనారు గూడా వచ్చేవి వార్షిక పరీక్షలు పరిస్థితి ఇలాగే ఉంటే వాళ్ళేమై పోతారో నని భయంగా ఉందండీ!'

తన బుర్ర బొంగరంలా తిరిగింది. 'ఐతే... నువ్వు రోజూ రాత్రి వాళ్లను చదివించడం లేదా?'

పరిస్థితి ఎదుతు తిరుగుతుందని అర్థమై పోయింది మాండవికి.

'రోజూ చీవాట్లేసి కూర్చోబెడ్తున్నాను. కాస్సేపు కబుర్లు చెప్పుకున్నా చాలా సేపే చదువుకుంటున్నారు. మధ్య మధ్య

వాళ్లకర్థంగాని.వేవో అడిగేస్తున్నారు. నాదేమో వానా కాలం చదువాయె. మీరేమో పదిలోపల ఇంటికి రారాయె. వాళ్ల సందేహాలు తీర్చడం నావల్ల కావడం లేదు.'

'ఈ ఎత్తంతా నన్నింట్లో కట్టి పడెయ్యటానికే కదూ!'

జవాబు కెదిరి చూడకుండా వచ్చేశాడు-నవ్వుతూ.

'ఏదన్నా ఎమర్జన్సీకేసా సార్!' నిశ్శబ్దాన్ని చీల్చాడు కాంపౌండర్.

'కాదు....డాక్టర్ నా స్నేహితుడు కలిసి పోదమనొచ్చా!'

'అలాగా.... మీ పేరుసార్!'

చెప్పాడు.

చకచకా పైకెళ్ళి రెండు నిముషాలలో తిరిగొచ్చాడు

''మిమ్మల్ని పైకి రమ్మంటున్నారు సార్!'

మెట్లెక్కుతుంటే జగదీశ్ మాటలు వినబడుతున్నై.

వెధవా! ఒక్క లెఖ్ఖను రెండుసార్లు చెబితేగాని అర్థమవడంలేదు. సరే....ఇది చెయ్!'

సహదేవ్‌ను సాదరంగా ఆహ్వానించాడు డాక్టర్ జగదీశ్ మిత్రులు మాటల్లో పడిపోయారు. మధ్య మధ్య జగదీశ్ కొడుకు లెఖ్ఖల గురించి అడుగుతూనే వున్నాడు- అతడు చెబుతూనే వున్నాడు-విసుక్కోకుండా.

సహదేవ్‌కు ముళ్ళమీద కూచున్నట్లనిపించింది.

'పిల్లలు బావున్నారా అన్నయ్యా!' డాక్టర్ భార్య కూల్ డ్రింక్స్ అందించింది.

''బావున్నారమ్మా!''

'రామేశ్వరం పోయినా శనేశ్వరం వొదలదన్నట్టు....నాల్గు చేతులా సంపాదిస్తున్నావ్.... పిసినారితనం మాత్రం నిన్నొదల లేదురా....' అందామనుకుని తమాయించుకున్నాడు.

'ఏరా బాబుకు ట్యూషన్ పెట్టలేదా?'

'పెట్టా్రనా.... మరి నీ పిల్లలకూ!'

'పెట్టించాను....కాని నువ్వే మీవాడికి లెక్కలు చెబుతున్నావేమిటి? బడిలో ట్యూషన్లో చెప్పరా? ఎందుకుధా అనవసరమైన శ్రమ.' మందలించాడు-ఖాళీ గ్లాసు టేబుల్ మీదుంచుతూ.

డాక్టర్ జగదీశ్ పెదాలమీద చిరునవ్వు మెరిసింది.

'మావాడిది కాస్త మంద బుద్ధిరా. ఒకటికి నాల్గుసార్లు చెబితేగాని అర్థం గాదు. ఐనా...స్కూల్లో, ట్యూషన్లో చెప్పే మాష్టార్లు జీతం డబ్బుల కోసం చెబుతారు. డబ్బులు పుచ్చుకుంటున్నారు కాబట్టి. ఒకటి లేదా రెండు సార్లు చెబుతారు. కాని అర్థమయే దాకా అందరికీ చెప్పలేరుగదా!, తండ్రిగా వాడెంత వరకు చదివాడు, అర్థం కాని వేమున్నాయన్నీ తెలుసుకుని పదిసార్లయినా సరే వాడి కర్థమయేలా చెప్పే బాధ్యత నా మీదుంది. పేషెంట్స్ లేని సమయాల్లో వీడితోనే గడిపేస్తా రోజూ కాస్సేపు.' సహదేవ్‌లో కలకలం, బయలు దేరింది. మొహమ్మీద నీలినీడలు తిరగాడుతున్నై.

'అదేమిట్రా అలాగై పోయావ్! చాలా రోజుల తర్వాత కలిశాం గదా....చెప్పు కబుర్లు.'

డాక్టర్ జగదీశ్ మాటలు సహదేవ్ బుర్రలో కెక్కలేదు.

'నేనెళ్లొస్తాన్రా... పిల్లలకు వార్షిక పరీక్షలు దగ్గర కొస్తున్నై' అంటూ మెట్లు దిగాడు. డాక్టర్ జగదీశ్ దంపతులు మొహాల్ని చూసుకుని నవ్వుకున్నారు- సంగతేమిటో అర్థం గాక.

* * *

(జాగృతి 1-7 మే 1989)

# అగ్ని పరివేశం

'చూడబ్బాయ్! పెద్దలు సంపాదించిన ఆస్తుపాస్తులేవీ లేవంటున్నావ్.... ఉద్యోగం కూడా లేదు. మరేం చూసి నీకు కన్యాదానం చెయ్యమంటావ్...' సూటిగా ప్రశ్నించిన రాజా రావు గారిలో హుందా తనం.... ఠీవి ప్రస్ఫుటమౌతున్నాయి అనుకోని ప్రశ్న బాణంలా గుచ్చుకుంది సుకుమార్‌కు.

'నాకు....ఎమ్మేడిగ్రీ ఉందండీ....' వినయం తెచ్చి పెట్టుకున్న గాంభీర్యంతో తటపటాయించాడు సుకుమార్.

'నాలిగ్గీచుకునేందుకా....?' కోపం లేనికొట్టు.

'ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీలో రిజిష్టర్ చేయించానండీ....' ఓపిక అవసరమైంది.

'రిజిస్ట్రేషన్ చేసేప్పుడు ఎంప్లాయిమెంటాఫీసు గుమాస్తా చేతులు తడిపేందుకు....నీకు బహుమతిగా వచ్చిన పతకాన్నమ్మావ్ కదూ!' నిర్మొహమాటం, నిష్ఠుంకోచం.

నీరుగారి పోయాడు సుకుమార్

నిరుద్యోగ పర్వం నిజస్వరూప మింత భయంకరంగా ఉంటుందా? తనను తానే అడిపోసుకున్నాడు

హైమవతీ తాను గాఢంగా ప్రేమించుకున్నామనీ,... ఆశీర్వదించి పెళ్ళి చేయమని - ఆమె తండ్రిని అడిచినప్పటి సంభా

షణ గుర్తుకొస్తే అతని గుండెల్లో గునపాలు దిగబడిపోతాయి. కాని...కడిగిన మల్లెపూవును తలదన్నే ముఖారవిందము. బంగారు తీగల్లా చుట్టుకుపోయే నాజూకైన చేతులు... అందానికి మెరుగులు దిద్దే అమాయకత్వం... హైమవతి కళ్ళ ముందు మెరవగానే గునపాలు కాస్తా పూల బాణాలై పోతాయి.

....ఆనాడు నిరుద్యోగిని. ఈనాడు ఉద్యోగంలో జాయిన యిన ప్రయోజకుణ్ణి.... అనుకున్నప్పుడు మాత్రం గర్వంగా ఫీలౌతాడు.... ఆడుక్కుతినేవాడు అమాత్యవర్యుడైనట్టు.

ట్రైనింకెళ్ళేముందు....హైమవతి విసిరిన అయస్కాంతపు చూపుల్ని.... చెదిరిపోకుండా ఎదలో భద్రపరుచుకున్నాడు.

ఇల్లొచ్చింది....దిగవయ్యా' ఒంటెద్దు బండి కనకయ్య ఈ లోకంలో పడేశాడు సుకుమార్ని.

బండి దిగ్గానే బంగారు బొమ్మ కోసం విసిరిన చూపులు ... తిరిగొచ్చేసాయి; పరావర్తనం చెందిన కిరణాల్లా. వచ్చేముందు హైమకు ఉత్తరం రాసినా ప్రయోజనం లేదనుకున్నాడు.

....తప్పకుండా వచ్చేస్తుంది.... చుట్టేస్తుంది.... చిలిపి ఊ

హల్తో స్నానాదులు ముగిసాయి 'భోజనం రెడీ!' అంది అమ్మ.

చెల్లి మనోహరి కొసరి కొసరి వడ్డిస్తూంటే—అమ్మచేతి వంట అమృతమన్పించింది.

నేను....ఉద్యోగంలో జాయినయానమ్మా! అన్నాడు ఆల వోకగా... అన్నంలో వచ్చడి కలుపుతూ.

అమ్మ పొంగిపోయింది....మనోహరి ఆనందసంద్రంలో మునిగి తేలింది. వెంటనే

ట్రైనింకని వెళ్ళావు కదరా అన్నయ్యా ... అందిచారు వడ్డిస్తూ.

'నిజమే మనూ... ట్రైనింగ్‌లో ఉండగానే పోస్టింగిచ్చారు. రిలీవ్ కాగానే వెళ్ళి ఉద్యోగంలో జాయినయాను.' అతని కళ్ళ లోని వెలుగుల్ని చూచి మరింత మురిసిపోయింది తల్లి హృదయం.

ఏదో విధంగా.... హైమవతి గురించి ప్రస్తావించేందుకు దారులు వెతుకుతుంది మనసు.

'ఏవూళ్ళో నాయనా?' అడిగింది పెరుగు వడ్డిస్తున్న అమ్మ.

'కేశవపురంలో....'

'కేశవపురమా... ?' కోరస్‌గా అన్నారు అమ్మా, మనోహరి వాళ్ళిద్దరి మొహాలలో-చోటుచేసుకుంటున్న సిగ్గు సిడుల్ని గమనిస్తూంటే వింతగా తోచింది.

'ఔను! నిన్న.... శనివారం జాయినయాను. సాయంత్రం మనూరికి బయలుదేరాను ఈరోజు ఆదివారం....మళ్ళీ రేపు వెళ్ళాలి. అద్దె ఇల్లూ అదీ చూచుకోవాలి....' అంటూ చేతులు కడుక్కున్నాడు.

తర్వాత....మనోహరినడిగాడు హైమవతి గురించి

మనోహరి మొహమ్మీది సిగ్గు సిడులింకా తొలగలేదు. తల వంచుకుంటుంది.

'ఏమ్మా! చెప్పవా నీ స్నేహితురాలి గురించి?' అవహనం తొంగి చూచి దాక్కుంది

'నా స్నేహితురాలేనా....?' నవ్వాలని ప్రయత్నించింది.

సస్పెన్స్ భరించలేక పోతున్నాడు.

ఆ ప్రస్తావన అప్పుడే రాకుండే బాపుండనిపించింది మనో హరికి-కాని సుకుమార్ ఊరుకొనేట్టులేదు.

'హైమవతికి పెళ్ళై ఎనిమిది మాసాలైందన్నయ్యా!' వెం టనే అన్నయ్య ముహంలోకి చూసింది వాలకం గమనించాలని ... సాధ్యమైనంత తొందరగా వేరే విషయం ప్రస్తావించాలని. సుకుమార్ తల తిరిగి పోయింది

....తన స్వప్న సుందరి అందకుండా పోయిందా?

....తన ప్రేమ సౌధం పేక మేడలా కూలిందా??

అయ్యుండదు....తేరుకుని....

'చాల్లే మనోహరీ! తమాషాకీ విషయమే దొరికిందా....'

మనోహరి కనుకొలుకుల్లో తిరిగిన నీటిని చూడగానే షాక్ కొట్టినట్టయింది.

'తమాషా కాదన్నయ్యా! నిజమే.... అదిప్పుడీ లోకంలో గూడాలేదు' అంది ఓణీతో కళ్ళద్దుకుంటూ.

సుకుమార్ మీద పిడుగుల వర్షం కురిసింది. తల బద్దలయ్యే ట్టుంది. తనను మోస్తున్న కుర్చీ పాతాళంలోకి దిగబడి పోతుంది. మనోహరి ప్రయత్నం ఫెయిలైంది.

'అదెలా....?' అనగలిగాడు.

'ఓ సంవత్సరం క్రితం నువ్వెళ్ళగానే వాళ్ళ నాన్న గారొక గొప్పింటి సంబంధం చూసారు- ససేమిరా చేసుకోనంది హైమ వాళ్ళు చూపించిన అబ్బాయిని చేసుకోకపోతే తల్లిదండ్రు లిద్దరూ కలిసి విషం మింగి చస్తామని... దాని మెడలు వంచేసారు.

కట్న కానుకలు బాగానే ముట్ట జెప్పారట. నలుగురన్నదమ్ముల్లో చిన్నవాడట అబ్బాయి. బాగా చదువుకున్నవాడట గూడా. నాల్గు నెలల తర్వాత ... హైమ తల్లి కాబోతుందని తెలిసి వాళ్ళమ్మా నాన్నలు సీమంతానికి తీసికొద్దామని వెళ్ళారట. గొంతు బొంగురు పోయింది

'ఏ వూరు?' వేదన నాపుకునే ప్రయత్నం

'కేశవ పురం....!'

'కేశవ పురమా .. సీమంతానికా?' ఆశ్చర్యం

'ఔను ...కాని వాళ్ళు వెళ్ళేసరికే జరగాల్సిన ఘోరం జరిగిపోయిందట....' అన్నయ్య కళ్ళలోకి చూచింది.

'అంటే!' ఆతృత, అయోమయం.

హైమ భర్తకు బ్లడ్ కాన్సరుందని ఆలస్యంగా తెలిసిందట. లక్షల రూపాయలు ఖర్చుచేసి... ఎన్నో రకాల వైద్యం చేయించారట రాయువెల్లూరు హాస్పిటల్‌లో గూడా పరీక్షలు చేయించార్ట రోగం ముదిరిందని పెదవి విరచిన డాక్టర్లు. మందులు రాసిచ్చి చేతులు కడుక్కున్నారట. కొద్ది రోజులలోనే రక్తం కక్కి కన్ను మూసాడట ... 'హైమా! హైమా' గొంతు చినిగేట్టు అరిచాడు.

నిద్రాదేవి కౌగిట్లో ఒరిగిపోయిన టూటైరు బర్త్ను చుట్టుముట్టిన కొందరు తట్టిలేపారు .. తాను పలవరించినట్టు గుర్తుకొచ్చింది-సారీ చెప్పాడందరికీ....తప్పుచేసిన వాడిలా.

వీడెవడో తీవ్రవాదిలాగున్నాడనుకున్నవారి అంచనాలు పటాపంచలై పోనాయి. 'కిమ్మనకుండా వెళ్ళి.... తిరిగి నిద్రలోకి

జారుకునే ప్రయత్నం చేస్తున్నారు.

దేశమంతా కరువు కాటకాలతో బాధపడుతూంటే తాను మాత్రం పూటపూటకూ విందు భోజనం వదులుకోలేని నాయకుడిలా రైలు మాత్రం శూన్యంలోకి దూసుకు పోతుంది- ఇవేవీ పట్టించుకోకుండా.

హైమ అంటే ఎవరండీ?'.... పల్లీవాల పదహారు పళ్ళు బయట పడ్డాయి.

'సినిమా హీరోయినా....?' చంకలెగిరేస్తున్న చాయ్‌వాలా మురిపెం.

'ఏదో పీడకలొచ్చుంటుంది... పాపం! ఆయన ప్రాణాలు తోడేస్తారెందుకు?' ఆవలిస్తున్న పక్కబెర్తు పెద్ద మనిషి విసుకున్నాడు. సుకుమార్ నుండి సమాధానం రాలేదు.

కిటికీ తలుపులు తెరవగానే నిషాదేవి ఖుషి రాజ్యం కన్పించింది. రైలింజను లైటు వెలుగులలో.... చెట్లు కొరివిదయ్యాల్లా మెరిసి మాయమౌతున్నాయి. చల్లని గాలి ముఖం కడిగింది. టైం చూచుకున్నాడు సుకుమార్. రాత్రి పన్నెండైంది. కిటికీ తలుపులు మూయగానే బర్తు పడుకోమంది.

మనోహరి చెప్పిన దృశ్యాలు కళ్ళముందు సినిమా రీళ్ళలాగా తిరుగుతున్నాయి.

....శోకదేవత హైమవతి తల్లడిల్లుతుంది. సర్వస్వం దోచుకున్న దేవుణ్ణి నిలదీస్తుంది. పున్నమ చంద్రుని కప్పేస్తున్న మబ్బుల్లాగా....వెంట్రుకలు మోహం నిండా నాట్యం చేస్తున్నాయి. గుండెలు బాదు కుంటుంటే గాజులు ముక్కలై పోతు

పోతున్నాయి. ఏడ్చిఏడ్చి కళ్ళల్లో నీరు ఇంకిపోయింది. గొంతు బొంగురు బోయింది.

అటిద్దరు, ఇటిద్దరు ఆడవాళ్ళామెను పట్టుకుని శవం వెంట నడిపిస్తున్నారు. బంధువులు, అభిమానులు గుంపులు గుంపులుగా వెంబడిస్తున్నారు.

రకరకాల కామెంట్సు వినబడుతున్నాయి.

హైమవతికి లోకమంతా శూన్యంగా కనబడుతుంది. మర బొమ్మలా నడుస్తుంది.

....తానిహ పసుపుకుంకాలకూ, పూలకూ, అలంకారాలకూ దూరం కావాలి....వెక్కిరింతలు భరించాలి.... తెల్లవారే తన మొహం చూచిన వారి తిట్ల వర్షం భరించాలి.... శుభకార్యాలేవీ తన చేతులమీదుగా జరగరాదు....అన్నింటినీ మించి-తండ్రిలేని పసికూనకు జన్మనివ్వాలి... జీవితమంతా రంపపుకోత భరించాలి.... అంతరంగం అల్లకల్లోలం.

శవయాత్ర శ్మశాన స్థలంచేరింది. ఓపక్క, శవదహనానికి కావాల్సిన ఏర్పాట్లన్నీ చకచకా జరిగిపోతున్నాయి. మరోపక్క ... ముత్తైదువలు హైమవ్వ తలమీద బిందెలనిండా నీరు కుమ్మరిస్తున్నారు. ఆ తర్వాత .... పట్టు పీతాంబరం హైమవతి ఒంటిని చుట్టేసింది. జడవేసి తలనిండా పువ్వులు తురిమారు. తిలకధారణ జరిగింది. ఒళ్ళంతా పసుపు కుంకుమలతో నిండిపోయింది. ఒడి బియ్యం పోసి మంగళ హారతులిచ్చారు. పేర్చిన చితివద్దకు నడిపిస్తూ పాటలు పాడారు

ఆమె భర్త శవాన్ని చితిమీద పడుకోబెట్టారు. ప్రపంచాన్ని

మరిచి.... పిచ్చి చూపులు చూస్తున్న హైమవతి.... శవం పక్క లోకి చేర్చబడింది. పైన కట్టెలు పేర్చారు. కొన్ని కిరసనాయిల్ డబ్బాలు చితిమీద ఖాళీ ఐనాయి. దంపతులకు పుణ్యలోకం ప్రాప్తించాలనే పాటలు గొంతులు విప్పి పాడారు. పురోహితులు మంత్రోచ్చారణగా పిస్తుంటే.... వచ్చిన వాళ్ళంతా అక్షింతలు చల్లి దూరంగా జరిగిపోయారు.

కాగడాతో చితి అంటుకుంది.

హైమవతి హాహాకారాలు చితిమంటలలో కలిసి ఆకాశాన్నంటుకున్నాయి ప్రాణంలేని శవంతో పాటు ప్రాణమున్న శరీరం కాలిబూడిదైంది. పొగలు బంధుమిత్రులకు వీడ్కోలు చెప్పేసాయి వారికి లభించబోయే స్వర్గసుఖాల గురించి ముచ్చటించుకుంటూ ఇంటి మొహం పట్టారంతా.

... అలనాడు దక్షయజ్ఞంలో దూకిన అమ్మవారి లాగుంది ...

భార్యా భర్త లొకేసారి స్వర్గద్వారం చేరడం.... పూర్వజన్మ సుకృతమే....

ఆఁ... సుకృతమా ... గాడిద గుడ్డా...! కొందరి గుస గుసలు.... మరికొందరి రుసరుసలు.

* * *

వారాని కొకసారి మాత్రమే వచ్చే ఆదివారం ఆలస్యంగా నిద్రలేపింది సుకుమార్‌ను. మొహం కడుక్కొని పేపరు తిరగేస్తుంటే.... మనసులగ్నం కాలేదు

శనివారమే శ్మశానం వైపు వెళ్ళొచ్చాడు.

చిరునవ్వులతో... చిలిపి చేష్టలతో కనిపించింది హైమవతి

.. చేతులు చాచింది....

'....నువ్వు ట్రైనింకెళ్ళక పోతే ఉద్యోగం రాదు....ఉద్యోగం లేకపోతే .. మానాన్న మన పెళ్ళి కొప్పుకోడు.... వెళ్తే సంవత్సరం దాకా తిరిగిరానంటున్నావు, ఎలా సుకుమార్....?' హైమవతి కాటుక కళ్ళలో గిరుక్కుమన్న. కన్నీరు మనసంతా కలిచి వేసింది

చేతులు చాచగానే....తీగలా చుట్టుకు పోయింది.

'....వచ్చేదాకా ఉత్తరాలు రాయకు సుకుమార్' బుంగమూతి పెట్టింది.

'....తపాలాశాఖ మీద కోపమా?' బుంగమూతి గిల్లగానే కిలుక్కుమంది.

'... కాదు' ఇంద్రధనుస్సులా మెరిసింది.

'మనలాంటి ప్రేమపక్షులకవేకదా ఆశాదీపాలు' మరోబుగ్గ గిల్లాడు. ముఖం మందారపువ్వైంది.

దివ్యాను భూతి తళుక్కుమంది. రెండు చేతులతో మెడను చుట్టేసి గుండెలమీద ఒరిగిపోయింది.

' నిజమేకాని....నీ పోకిరిచేష్టలతోనే భయం. అవే.... ఉత్తరాలలో రాస్తావు-మా నాన్న చూస్తే అగ్గిమీదగుగ్గిలమై పోతాడు బలడరాముడై పోయి నన్నొకరి కన్నా ఇచ్చి కట్టబెడతాడు నువ్వు దేవదాసువై పోతావు నేను మాంగల్యబలముంటూ గింజుకోవాలి. ఇహ చివరకు మిగిలేది?....' గిలిగింతలు పెట్టింది.

హైమా....హైమా!..

'ఏంనాయనా...హైమా అంటూ అంత గట్టిగా పిలుస్తు

న్నావు....' ఇల్లుగలాయన కాఫీ గ్లాసులతో ప్రత్యక్ష మయ్యాడు.
సిగ్గుపడ్డాడు సుకుమార్.

లేచి....సవినయంగా ఆహ్వానించి

'....అబ్బే... నేనాండీ....! అన్నాడు' చుట్టుకు పోయిన అనుభూతులలోంచి.

'రాత్రింతా అదే పేరు పలవరిస్తున్నావు. నీకూ మాకూ తడికే అడ్డం కాబట్టి స్పష్టంగా వినబడుతుంది ఇంతకీ ఎవరా హైమ?' బుజ్జగింపుగా అడిగాడు – కాఫీగ్లాసులు టేబుల్ మీదుంచి తీసుకొమ్మని కళ్ళతో సైగచేస్తూ, పేపరు ముసలాయన చేతులలో కెళ్ళింది.

అద్దె పోర్షను తడికలదైనా ఇల్లుగల ముసలాయన హృదయం మాత్రం పెద్దబంగళా లాంటిదని నాలోజులలోనే తెలిసి పోయింది. ముసలి ప్రాణాలకు తోడుగా ఉంటాడని తడికకట్టి అద్దెకిచ్చాడు. ఆయన కొడుకులకు ఉద్యోగాల రెక్కలొచ్చి, కూతుళ్ళ పెళ్ళిళ్లై ఎగిరిపోయారట.

'....ముందు కాఫీ తాగునాయనా!' స్పందించని సుకుమార్‌కు కాఫీ గ్లాసందించాడు ఆప్యాయంగా.

'బాబాయ్‌గారూ....!' నెమ్మదిగా పలుకరించాడు.

'ఊం....' ఏమిటో చెప్పమన్నట్టు చూచాడు.

'ఈ వూళ్ళో సతీసహగమనం కేసులేమైనా.... ఐనాయా?' అడగలేక.... అడగదల్చింది అడిగేసాడు.

'అంటే....?' ముసలాయన భృకుటి ముడిపడింది.

'చచ్చిన భర్త శవంతో...బ్రతికున్న భార్యను కాల్చేయడం'

సుకుమార్.... పలవరింపుకు కారణం చెప్పకుండా చాక చక్యంగా దాటివేస్తున్నందుకు నవ్వొచ్చింది.

'హైమవతి అనే అమ్మాయి.... భర్త శవాన్ని కాల్చేస్తుండ గా చితిలో దూకిందని విన్నాను....' మొహంలో రంగులు మారి ఏదోగుర్తు కొచ్చి ఆగిపోయాడు.... రెడ్ సిగ్నల్ చూచిన రైల్లా.

దూకేప్పుడు వూరివారంతా చూస్తూ ఊరుకున్నారన్నా మాట. ఒక నిండు ప్రాణాన్ని బలీదీసుకున్నారు వాళ్ళు....చెప్పా పెట్టకుండ తోసుకొచ్చింది ఉద్రేకం.

'ఆ అమ్మాయి గర్భవతని గూడా తెలుసు....'

'... తెలిసి గూడా రాక్షసకృత్యాన్నాపలేదా?'

'ఏం చేస్తారు బాబూ ఊరకుండక....' ముసలాయన గూడా స్పందించాడు_ఇహలాభం లేదని.

అంటే...

'వాళ్ళు జాగీర్దార్లు. పేరుమోసిన దొరల కుటుంబం. హైమ వతి భర్త రాఘువేందర్ సద్గుణరాశి. పెద్దకట్నంతో పెళ్ళి ఘనంగా జరిగింది. పెళ్ళైన రెన్నెళ్ళ తర్వాత తెలిసింది.... రాఘువేందర్ కు బ్లడ్‌కాన్సరని. గుండెలు పగిలేలా ఏడ్చిందా అమ్మాయి. ఐనా ...భార్యగా సేవలందించింది. ఎన్నో వ్రతాలు చేసింది గండం గడవాలని'

సుకుమార్ కనుకొలుకులలో వేదనాశ్రువులు చోటు చేసుకు న్నాయి. కళ్ళు మూసుకుని వింటున్నాడు.

'రాఘువేందర్‌తో కలిసి నలుగురన్నదమ్ములు. కోట్లరూపా యల ఆస్తికి వారసులు ఆస్తి పంపకాల గురించి అంతకు ముందే

చాలాగొడవలైనాయని విన్నాంగాని.... పెద్దింటి పేచీలు గేటుదాటి బయటకు రాలేదు. రాఘవేందర్ శవంగా మారగానే మిగిలిన ముగ్గురన్నదమ్ములు కూడబలుక్కున్నారు-ఏదో విధంగా హైమవతినీ లోకంనుంచి పంపించాలని ... ఆస్తిని మూడు వాటాలుగా పంచుకోవాలని. నిజానికామెను చితిలోకి నెట్టి....ఆమెనే దూకేసిందని ప్రచారం చేయించారు. వాళ్ళనెదిరించే ధైర్యమెవరికుంది ఊళ్ళో? ఆమెనూ.... గర్భస్థ శిశువునూ మింగేసిన పాపాత్ములు దశదిన కర్మ పెద్ద ఎత్తున జరిపించారు. దాన ధర్మాలు చేసారు. ఊరి వారంతా విందు భోజనాలారగించారా రోజు....' కంటి ధారల్ని తుండుగుడ్డతో తుడుచుకున్నాడు ముసలాయన.

'ఐతే... ఈసంగతెవ్వరూ పోలీసులకు తెలియజేయలేదా?' మాయమైన ఉద్రేకం ప్రశ్నించింది. అది మరింత పెరిగి ధైర్యంగా మారింది.

'చెప్పరేం బాబాయ్!' పిడికిళ్ళు చిన్నగా బిగుసుకుంటున్నాయి.

'రిపోర్టు ఇచ్చిన వాళ్ళనే పట్టుకు తంతారు పోలీసులు.' నిర్వేదం నిట్టూర్చింది.

'ఎందుకు?'

'రిపోర్టు చేసిన వ్యక్తే ఫస్టు ఇన్ఫర్మేంటవుతాడు. ఆవ్యక్తికే సర్వస్వం తెలుస్తుందనుకుంటారు పోలీసులు నేరానికి కారకులైన వారందరి పేర్లు చెప్పేదాకా వదలరు. నేరస్థుల పేర్లు చెప్పిన వాడికి రక్షణ ఉండదు. కాని గంటలలో శవమైపోతాడు. దొరలకు కోపమొస్తే.... ఇంకేమైనా కావచ్చు శిక్ష కఠినంగా.

ఎందుకొచ్చిన తంటాలని ఎవ్వరూ ముందుకు రాలేదు.' ఖాళీ గ్లాసులందుకున్నాడు.

కుర్చీలో... వెనక్కి వాలిపోయాడు సుకుమార్. తోసుకొచ్చే కన్నీటి నాపలేక పోయింది. ధైర్యం.

'జాస్సేపాగి'

'ఏది ఏమన్నా గాని ... నేనే పోలీసులకు రిపోర్టిస్తా నిప్పుడు ....' అంటూ లేచాడు ఒక నిర్ణయంతో.

హైమవతే హేమ అన్న సంగతి ఎప్పుడో తెలిసి పోయింది ముసలాయనకు.

'అన్నీ తెలిసే.... అగ్ని ప్రవేశం చేస్తావాబాబూ?' వారించబోయాడు.

సామాన్యుల భయమే రాక్షస కృత్యాలకు ప్రాణ ప్రదమౌతుంది. స్వార్థపరులు ఇష్టా రాజ్యం కొనసాగిస్తూ సాంఘిక ఆచారముని ముద్రవేస్తున్నారు.

'ఎన్నాళ్ళిలా నడుస్తుంది బాబాయ్?'

సుకుమార్ మొహం మంకెన పూవైంది.

క్షణాలలో తయారై బయల్దేరాడు.

అపరావతార మూర్తిలా కన్పించాడు ముసలాయనకు

("సాధన" కథల పోటీల్లో బహుమతి పొందిన కథ.
అక్టోబర్ 89)

# మెరిసేదంతా...

కొత్త ఊరికి రాగానే వసంతరావు జీవితంలోంచి చెప్పా పెట్టకుండ పారిపోయింది వసంతం. కాలం....కాళ్ళను ఒట్టి ఎవరో గట్టిగా లాగేస్తున్నట్టు నత్త నడక నడుస్తుంది. అంతకు ముందు తానుపంజేసిన ఊరిలో గడిపిన రోజులు నిత్యకల్యాణం పచ్చతో రణాలు. ఆ స్వర్ణయుగం ఛాయలు మెదడులో సుడులు తిరుగు తూంటే నత్తగుల్లలా ముడుచుకు పోతాడు.

ఆ ఊళ్లో సంవత్సరాలు నెలలుగా, నెలలు రోజులుగా రోజు లు గంటలుగా, గంటలు నిముషాల్లా దొర్లిపోయేవి.

ఇంతకూ-ఆఊళ్లో వెలగ బెట్టింది, ఈ ఊళ్లో వెలగబెడ్తుంది టెలీఫోను ఆపరేటరుద్యోగమే. కాని ఆఊరు నందనవనంలా తో చింది. మరి ఈఊరెందుకలా కన్పించలేదో – చెప్పాలంటే చాలా ఉంది.

పాత ఊరు.... అబ్బే ఊరేంటీ, పట్నమే - వ్యాపారస్థుల పోటీలతో నిండుంది. ఒక టేబులు నాల్గు కుర్చీలు అప్పటికప్పుడే కొనిపడేసి వ్యాపారం ప్రారంభిస్తారు. టెలీఫోన్ రాగానే వ్యాపా రం జోరవుతుంది టెలీఫోన్ నోరు విప్పకుంటే వ్యాపారం పూర్తిగా మూతబడ్తుంది, వ్యాపారం మూతపడితే వేలను లక్షలుగా, లక్ష ల్ని కోట్లగా పెంచాలనే నిచ్చన మెట్లు జారిపోతై. టెలీఫోన్

ఈ నాన్న-ట్రంకాల్స్ సరిగా దొరకాలంటే ఆపరేటర్ అనే జీవిని ప్రసన్నం చేసుకోవడ మెంత ముఖ్యమో వాళ్లకు బాగా తెలుసు.

ఆపరేటర్ల నవమాన పరిచినట్టు మాట్లాడినా.... వాళ్లకి వారవారం గుట్టుచప్పుడు కాకుండా మామూళ్ళందివ్వక పోయినా, లాభం సంగతి దేవుడెరుగు- బ్రోకర్ వ్యాపారం హళ్లికి హళ్లి సున్నకు సున్న.

అందులోనూ మాటల చాతుర్యంతో అమ్మిని బమ్మి బమ్మిని తిమ్మి చేయగలిగే వసంతరావుతో కలిసుండడం చాలా అవసరమన్న సంగతి గూడా తెలుసు-వ్యాపారస్తులకు.

బ్రోకర్ వ్యాపారి స్కూటర్ మీదెక్కి ఎంచక్కా పొట్టిలో పాల్గొనేవాడు ఇతరుల స్కూటరెక్కడం నామోషీగా తోచిందేమో అదే వ్యాపారిని స్కూటర్ కొనియ్యమన్నాడు-వారం మామూళ్ళ కింద తీర్చేస్తానని ఇంకేముంది... సొంత స్కూటర్ ఇంటిముందు వాలింది.

ఈ వయసులో వెలుగులా డ్యూటీకెళ్లి రాత్రికి సినిమాకు షికారెక్కి వచ్చేవాడు.

ఆపరేటర్లందరూ ఇలాగే ఉన్నారా అనే అనుమానం మెదిల్చిందోసారి ఆయన్ని వాళ్ళకంత ధైర్యం లేదనిపించింది. వాళ్ల చేతగాని తనానికి నవ్వొచ్చింది గూడా

“జీవితమంటే ఒక ఆటలా ఉండాలి! ఇలా డ్యూటీ కొచ్చి అలా ఇంటికెళ్తే [illegible]” అన్నాడు ఆలాపనే ఆపరేటర్ అతన్ని గూడా తన దారికి మళ్లించాలని.

“నేను కేవలం జీతంతో తృప్తిపడే వాణ్ని. నాకలాంటివి

వంచించకు' అన్నాడతడు ముభావంగా.

నిలువునా చీరెయ్యాలన్పించిందతణ్ని కాని వాడి ఖర్మకు వాడిదని వొదిలేశాడు-తన తెలివితేటలు ఎవరికీ లేవని ఎంతో ఇదై పోతూ.

ఉద్యోగం లేనప్పుడు జేబులో చెయ్యేస్తే షాక్ కొట్టేది-చిల్లర డబ్బులు గూడా లేక. ఆపరేటర్లైం తర్వాత బార్లో బీర్లూ .... మూడు నక్షత్రాల మందులు.... నిత్య కల్యాణం పచ్చతోరణం.

ఆర్డనరీ ట్రంకాల్ను లైటనింగని చెప్పి ఇప్పించడం, ముప్పై నిముషాలు మాట్లాడించి మూడు నిముషాలు రాయడం .... ఏన్నో చిట్కాలుపయోగించాడు-డిపార్ట్మెంటు కి తెరిగి వాత పెడుతున్నాననీ- తెగ సంబర పడిపోతూ. వక్క వారిలో పెకుడ్డా సుఖాలు ఆనే సూత్రం బాగా ఒంట బట్టింది. పెద్దపెద్ద సేట్లతో పరిచయాలు పెరిగాయి.

వాళ్లతో సినిమాలు, షికార్లకే కాదు అజంతా, ఎల్లోరా, ఊటీ, కొడైకెనాల్, వారణాసి ఢిల్లీలు గూడా వెళ్ళొచ్చాడు టాక్సీలలో. ఆనంద హర్మ్యాలెక్కి కేరింతలు కొట్టాడు.

'ఈ ట్రిప్పులో వసంతరావు వంతు వెయ్యి రూపాయలు'

'ఈ సారి మీ వాటా రెండు వేలు ...'

'ఢిల్లీ, వారణాసి ఎంజాయ్‌గా తిరిగొచ్చాం. వసంతరావు గారి సుద్దులకూ, భార్యకు కొనుక్కున్న చీరలకూ, సినిమాలకూ ఐదు వేలైంది.'

రకరకాల వ్యాఖ్యానాలు వినబడేవే కాని నోరు తెరిచి అడిగే వారు కాదు డబ్బులిమ్మని. తనపట్ల మిత్రుల ఆక్షేపణ సంకేతల్లో

కొచ్చినందుకు తబ్బిబ్బై పోయేవాడు. ఇంకా... వాళ్ళకు ఋణ పడుండటం బావుండదని హద్దులు దాటి సాయం జేసేవాడు- అది నేరమని తెలిసీ గూడా.

తన పెళ్లై అనూరాధ రాగానే ఓ మిల్లు యజమాని కారిచ్చాడు-హనీమూన్ కెళ్లి రండని. హార్సిలీ కొండలు, డెహ్రాడూన్ లలో జంటగా, కొంటెగా తోలెడంత అనురాగం పంచుకున్నాడు- అనూరాధతో.

తన పలుకుబడితో అనూరాధకో ప్రైవేట్ బడిలో ఉద్యోగం దొరికింది నిజానికావిడ ఉద్యోగం చెయ్యడమతని కిష్టంలేదు ....కాని అంత ధనవంతులైన మిత్రుల మధ్య నిలదిక్కుకోవాలంటే తప్పలేదు.

రోజూతను గుబ్బమెక్కో, ఏమగెక్కో వస్తుంటే అనూరాధ తన సొమ్మంతా పోయినట్టు చిర్రుబుర్రులాడేది. సన్నజాజి ముక్కుకూ, దొండపండు పెదాల్నీ, చేటలంత కళ్ళనూ ఎన్నో వంకలు తిప్పేస్తూ అలవాట్లు మానుకొమ్మని పోరు ప్రారంభించింది.

'ఇదంతా కేవలం హాబీ మాత్రమే' అంటే.

'ముందు హాబీగానే ఉండేది. ఇప్పటది అలవాటై కూచుంది. నెల జీతం మించిన ఖర్చు నేల విడిచిన సాములాంటిది. ఈ టీవి, ఫ్రిజ్, స్కూటర్, ఫర్నిచర్, నెలకు వెయ్యి రూపాయలు ఇంటద్దె ఎలా వస్తున్నాయి? మీరేదో కాని పని చేస్తున్నారని నాకు భయమేస్తుంది. దయచేసి అవన్నీ మానుకోండి!' అంది దీనంగా గోముగా.

'అబ్బా....ఏమిటీ నీ నస? నీకెందు కదంతా? నేనేమన్నా

కన్నాలు వేసి దొంగతనాలు చేస్తున్నానా?' అన్నాడు కోపంగా.

అనూరాధ మనసు అల్లకల్లోలమైంది. 'మీరు చేసేది ము మ్మాటికి దొంగ తనమే' అనాలనుకుని 'వద్దండీ.... మనకివన్నీ వద్దు. మన తాహతుకు తగినట్టే ఉందాం. అంతస్తు స్వయం కృషితో పెరగాలి గాని అడ్డదారిలో కాదండీ!' అంది వణికి పోతూ.

అప్సరస్సలా మెరిసిపోతున్న అనూరాధ అలా బేలగా డీలా పడిపోవడమేం బాగనిపించలేదు.

'చఛా.... అనవసరంగా ఏదో ఊహించుకుంటున్నావంతే ....!' తేలిగ్గా కొట్టి పారేశాడు.

'వద్దండీ... ఈ పరుగు కృత్రిమం. పడిపోతామని భయమేస్తుంది. ఉన్నంతలో గడుపు కుందాం. లక్షాధికార్లతో స్నేహం తప్పేమీకాదు. కాని మీరు తప్పటడుగు .. ' ఇంకేదో అనబోయింది. కనుకొలుకులలో మెరిసే నీటి బిందువులు బయట పడకుండా ప్రయత్నిస్తూ. ఎండకువాడిన ముద్ద మందారమైన ఆవిడ మొహాన్ని చేతులలోకి తీసుకుని

'పిచ్చి అనూ... లేనిపోని వాలోచించి గాబరా పడక, నీకు ఇంట్లో టైం పాస్ కాకపోతే చెప్పు, ఏ ప్రైవేట్ స్కూలులోనైనా. ఉద్యోగం చూసి పెడతా' నన్నాడు-గులాబి బుగ్గల్ని పెదాలతో స్పర్శిస్తూ.

వేడి పెనం మీది మంచుగడ్డలా కరిగిపోయింది అనూరాధ. ఎర్రని పెదాలలోంచి చొచ్చుకొచ్చిన ఆనంద తరంగాలు చెక్కిళ్ల మీంచి పాతి కళ్లలో ఎగిసి పడ్డాయి. ఉద్యోగం చేస్తానని ఒప్పుకుంది.

కిటికీలోంచి చూస్తున్న వసంతరావుకు చెట్టు మీది గువ్వల జంట కన్పించింది.

'జైల్లోంచి ప్రపంచాన్ని చూస్తున్నడా ఖైదీ' ఆడగువ్వ సిగ్గుల మొగ్గలు కుమ్మరించింది.

'కాదే బంగారుకొండా! అది జైలు కాదు. ఇంటి కిటికీ పెళ్లాం ఇంట్లో లేదుగదా....పిచ్చెక్కి పోతున్నట్టుంది.' సర్ది చెప్పింది మగ గువ్వ సిగ్గుల మొగ్గల నేరుకుంటూ.

అవి ఏం మాట్లాడుకున్నాయో గాని వసంతరావు ఆలోచనకలాగే వినబడింది.

అప్పుడే రిక్షా దిగి లోపలి కొస్తుంది–అనూరాధ. 'ఉత్తరం ముక్కగూడా రాయకుండా ఊడిపడ్డా వేమిటి అనూ!' అన్నాడు భార్యను వింతగా చూస్తూ. నిప్పులమీద మాడ్చిన వంకాయల్లా గుందామె.

బాత్రూంలో దూరబడి స్నానాదులు ముగించుకొచ్చింది.

మీ చిన్నమ్మ కూతురు పెళ్ళకి వెళ్లావుగదా! నీకో ఉత్తరం రాశాను అందిందా!.

'ఉత్తరం అందింది. మీ విచిత్రాలే అందలేదు' అంది బొట్టు పెట్టుకుంటూ.

అంటే....తాను పట్టుపడిన సంగతీ, ట్రాన్స్‌ఫరార్డర్ చేతి కొచ్చిన సంగతీ, తనకు స్నేహితులుగా మెదిలిన వారు తన కొరకు ఖర్చు చేసిన డబ్బులిమ్మని అడిగిన సంగతీ, టి.వి, ప్రెషర్ కుక్కర్, ఫ్రీజ్ ఎవరికి దొరికింది వారు మోసుకెళ్ళినట్టూ.... అన్నీ తెలిశాయన్న మాట. మొహం కందగడ్డయి పోయింది. 'మీరైతే ట్రా

న్నఫర్లై వచ్చారు. మరి నా ఉద్యోగం?' 'నిలదీసింది.' కలువ కళ్ళు కన్నీటి తెరలతో నిండాయి. 'నేనా ఊరు వెళ్లాను. మీరిల్లు ఖాళీ చేసారని చెప్పారు. మీరు మిత్రులని చెప్పుకు తిరిగిన వారు కొందరొచ్చి నన్ను అప్పుపడిన డబ్బులిమ్మని అడిగారు.

'ఎక్కడి' వన్నాను.

'నీ మొగుడికి ఖర్చు చేసిన' వన్నారు అప్పులు వేలమీదున్నాయి.

'వాడు పోతే ఏమైందిరా? బందరు లడ్డులె వాని పెండ్లాముంది....' అన్నాడొకడు.

'దీన్ని రాత్రే కిడ్నాప్ చేసి మన అప్పులు చెల్లగొట్టుకుందాం' ఇకిలించిండింకొకడు.

నానా దుర్భాషలాడి మళ్ళీ వస్తామని వెళ్ళిపోయారు. వెంటనే బస్సెక్కి వచ్చేశానిటు..'

వెక్కివెక్కి ఏడుస్తున్న భార్యను చూస్తుంటే. కడుపుని త్రేవుల్ని కోసేసినట్టయింది-వసంతరావుకు.

'మెరిసే దంతా బంగారము కాదు. చెడుస్నేహము తెచ్చును చేటు' పాఠం వల్లె వేస్తున్న పక్కింటి కుర్రాడి కప్పగించారు చెవుల్ని.

(23-29 అక్టోబర్ జాగృతి 1989)